ఆయుర్వేదోదయగ్రంథమాల—౧

# హిందూగృహవైద్యము.

ప్రథమభాగము.

ఇయ్యది,

భిషగాచార్య. పండిత. హెచ్. సుబ్బరాయశాస్త్రి,

కవిరత్న, గారిచే,

రచియింపఁబడియె.

మొదటి కూర్పు ౧౦౦౦



శికింద్రాబాదు.

డిగ్గిరెడ్డి-నారాయణరెడ్డి అండుకంపినీవారిచే

యూనివర్ సల్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1916.

| | చందాదారులకు | | | ఇతరులకు |
| --- | --- | --- | --- | --- |
| బ్రిటీషు | రు\|\| 0—6—0 | వెల. | బ్రిటీషు | రు\|\| 0—8—0 |
| హాలీ | ,, 0—8—0 | | హాలీ | ,, 0—10—0 |

# పోషకులు.

శ్రీ శ్రీ హోసూరు. రామస్వామయ్యగారు, బి. ఎ.
అనంతపురం

,, ,, గాడిచర్ల. వెంకటరావుగారు, పులివెందల

,, ,, రాయప్రోలి సదాశివయ్యగారు, ఇనాందారు
మిన్నకల్లు

,, ,, రాయప్రోలి. ఎల్లయ్యగారు, ఇనాందారు
మిన్నకల్లు

,, ,, హోసూరు. సుబ్బరావుగారు, జోడీదారు,
భైరసముద్రం

,, ,, కృష్ణశాస్త్రులవారు, సర్వాధికారి, శ్రింగేరి
మఠం మైసూరు.

,, ,, వి. డి. పిళ్లెగారు, యం. ఇ. బి. సి. ఇ.
హైదరాబాదు.

,, ,, టి. రామరావుగారు, దివాన్, ఆనగొంది.

శ్లో॥ వందేహమాదిశంకరం భగవత్పాదాఖ్యగురుసమారంభాం ।
శ్రీచంద్రచూడాయతిమాంపర్యంతాంగురుపరంపరామనిశం॥

సీ॥ ఏమహామహుఁడెట్టి హిందుదేశమునంతఁదిరిగి యుజ్ఞా
నోపదేశమిడెనో । ఏపూరిదర్శనావాస సంకీర్తన స్పర్శ
నంబులు జాలసౌఖ్యమిడెనో । ఎవనిమహిమ నాదునెం
గిలితసమునుబోఁగొట్టి యోగ్యతఁబూర్తినిడెనో । ఎవ్వా
నిసద్దయనేనుబెట్టినయట్టి గ్రంధమాలయు వృద్ధికాదోషఁ
గనో ॥

గీ॥ ఎవఁడు శ్రీశంక రాచార్యుఁడితఁడెయనఁగ । వరలుచుండె
నోయట్టి శ్రీపరమహంస । సకలబిరుదసమేత యశశ్శరీ
రి । సచ్చిదానందమూర్తిని సంస్మరింతు ॥

ఉ॥ శ్రీదశివాభినూతన నృసింహసుభారతికార్ష్ణవైద్యసం । వే
దికివేదవేదికి వివేకమహాత్త్వ జగద్గురుత్వసం । పాగనధన్య
చిత్తునకు వందనముల్ ఘటియించియీభిష । గ్వైదరహ
స్యకోశమును గ్రేవనుసంకిత మేను జేసెదన్ ॥

# To His Holiness Sri Jagadguru Satchidananda Sivabhinava Nrisimha Bharathi Swamy.

***of holy cherished Memory.***

THIS VOLUME IS RESPECTFULLY DEDICATED

*By the Author.*

# ERRATA.

# సవరణలు.

| పుట | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| i. | ౧౮ | అనుభవసిద్ధములెన | అనుభవసిద్ధములైన |
| ii. | ౧౫ | ప్రాణమ్ములు | ప్రాణములు. |
| iii. | ౭ | ఎడ్చి | ఏడ్చి |
| iii. | ౧౪ | సందేహార | సందేహార్థ |
| iv. | ౧ | యాథారము | యాధారము |
| ౭ | ౮ | సంధులుసందిబంధనములు. | (ఈపదము లిచ్చటతీసి వేయుడు). |
| ౧౬ | ౧౪ పటముక్రింద | యముక | యమక. |
| ౪౯ | చికిత్సలక్రింద ౮ | విఫ | విష |

---

పుస్తకములు వలయువారు ఈక్రింది అడ్రసులకువ్రాసి తెప్పించుకొనవచ్చును.

౧. భిషగాచార్య. పం॥ హెచ్. సుబ్బరాయశాస్త్రి కవిరత్న, వైద్యవిద్వాంసులు. "ఆయుర్వేదోదయగ్రంథమాల" ప్రధాన సంపాదకులు, శికింద్రాబాదు.

౨. ఆర్. సదాశివయ్యగారు,
మిన్నకల్లు, మామండిపోస్టు, సేలం జిల్లా.

3. మేనేజరు, సిటీ బుక్కుడిపో, అవిన్యూరోడ్డు, బెంగళూరు.

౪. మానేజరు, ఆయుర్వేదోదయ గ్రంథమాల ఆఫీసు,
జమ్మలమడుగు, కడప జిల్లా.

# పీఠిక

వైద్యమును సంగీతమును తెలియని మనుజులు భూలోకమున లేరని కొంతకాలము క్రిందటివరకు జనులనుకొనుచుండిరి. అందులో బ్రాహ్మణులలో వైద్యము, సంగీతము, జ్యోతిషము తెలియనివారే లేకుండిరనికూడ వినియుంటిమి. కాని ప్రకృతకాలపు నవనాగరికులకు వైద్య, సంగీత, జ్యోతిష విషయము లేదియేని తెలియవలసియున్న, ముసలాయననుగాని ముసలమ్మనుగాని అడుగవలసియున్నది.

"అమావాస్యనాడు తలగొరిగించుకొనకూడదురా, నాయనా!" అని వృద్ధజనకుడు ఉద్యోగాధికారములోనున్న 35 సంవత్సరముల ముద్దుబిడ్డని వేధించగా, వెంటనే మంగలి రంగని పిలిపించి "ఈదినమమావాస్యయని యేల చెప్పక పోతివి?" అని దండించు బ్రాహ్మణగృహస్థులసంఖ్య అపరిమితముగనుండుట మనకు తెలిసిన విషయమే. ఇక "నీవు చనిపోయిన పెమ్మటకదా, నేగొరిగించుకొనకూడదు." అని తండ్రికి బదులుత్తరము చెప్పు గృహస్థులసంఖ్య యింతయని నే జెప్పవలయునా!

ఇటులనే మనపూర్వులు బిడ్డలకేదియేని పీడాకరమగు వ్యాధులుకలిగిన తమతమయిండ్లలోనే అనుభవసిద్ధములైనచికిత్సలుచేసి ఆవ్యాధుల నివారింపచేసుకొని ప్రాణములను

రక్షించుచుండెరి. ఇప్పుడన్నానో క్రిందపడి గాయముతగిలించు కొన్న మాదిగనాగడుకాని, మంగలిపుల్లిగాడుకాని వచ్చిరేని చికిత్సింపవలయు. ముక్కున నెత్తురుకారినను, ఎముకలు పొర్లినను మిస్టరు "థం" గారేవచ్చి చికిత్సింపవలయు బిడ్డలకువాయువుకనిపించిన నాలుగామడలలోనుండు దగ్ధహస్తము పాపాచార్యులవారే రావలెను.

ఇచట గొప్పవ్యాధులన్నిటికిని పూర్వులందరును చికిత్సలు చేయుచుండిరనియు, వైద్యోత్తములచే వ్యాధులువచ్చినప్పుడు చికిత్సింపకూడదనియు, సూచించుట నాయభిమతంబుగాదు. శాస్త్రపాండిత్యమును వహించిన వైద్యులసహాయము దొరకకుండునప్పుడును, నిర్జనప్రదేశమున సర్పదష్టము యిత్యాదిప్రాణాపాయకరంబులగు వ్యాధులు సంభవించినప్పుడును, సమీపములోనున్న వనస్పతులతోగాని, సులభముగా లభ్యమగు శొంఠి, వజ, కరక్కాయి యిత్యాది ఔషధములతోగాని వైద్యుడొచ్చువరకును దిగ్భ్రమజెందక ప్రాణమ్ములు కాపాడుటకు వలయునుపాయంబులు గ్రహించియుండిరి ఇట్టిగృహవైద్య సంప్రదాయమిప్పుడు శేషించియుండు వృద్ధులనేకులకు తెలియునుకాని, ఆజ్ఞానము నానాటికినశించుచున్నది ప్రజలకిందరికిని తమదేహమును కాపాడుకొనువిషయము

తెలిసియే యుండవలెను. పల్లెటూళ్లలో యున్నప్పుడు కాని లేక దారినడచుచున్నప్పుడు కాని లేక అసహాయముగ నుండినప్పుడు కాని తమదేహమున కేదియేని అపాయము సంభవించిన తత్కాలోపశమన చికిత్సా సంప్రదాయములను తెలిసియుండిన ధైర్యము తెచ్చుకొని చికిత్సలు చేసుకొనవచ్చును. లేక యితరులకట్టివిపత్తులు సంభవించిన తోడ్పడవచ్చును. ఇట్టి జ్ఞానమేదియు లేనిచో విపత్తులు సంభవించినవారలు ఎడ్చి మొత్తుకొనుచుండగా తమకేమియు దోచక పశ్చాత్తాపము జెంది ఏదియేని యొకచికిత్స జేయదలతురుగాని అట్టి అసంప్రదాయ చికిత్సలు నిష్ప్రయోజకమగుటయే గాక రోగిప్రాణములుకూడ హరించును గనుక జనులందరును గృహవైద్య సంప్రదాయముల గ్రహించియుండుట త్యావశ్యకము.

ప్రకృతమచ్చులోనుండు వైద్యగ్రంథంబు లన్నియు వైద్యపరిభాషలతోను, సందేహరజటిల పదంబులతో నిండి యున్నవి. వైద్యవృత్తినిబూని నిశ్చయించి, అనేక సంవత్సరములు విద్యనేర్చినవారికిగాని తదితరులకు బోధపడవు. కాన సర్వులకు గృహవైద్యము యీషత్ప్రయాసతో బోధయగునటుల జేయు గ్రంథమాంధ్రంబున లేనందువలనను, యీ గృహవైద్యము మనకాలపువారనేకులు మరచిపోదురని తెలిసి

ప్రాయముచేతను నేనీగ్రంథంబు శాస్త్రానుభవముల యాధారములతో రచించినాడను.

నేనుద్దేశించి సన్నివిషయంబులిందు బొందుపరుచక యుండినను, ప్రస్తుత ప్రయత్నము భావిఫలవిశేషంబుల కంకురముగ నేర్పడిన సంతటితో తృప్తిజెందెద.

ఈగ్రంథమూల యుద్దేశంబుల కామోదించి ప్రథమంబున ద్రవ్య సహాయము జేయుటకనుమతి నొసంగిన పోషకులకును, చందాదారులకును, కడు కృతజ్ఞుడనై యుండుటయే కాక వారి శ్రేయోభి వృద్ధికై సర్వేశ్వరుని ప్రార్థించుచుందును.

ఈగ్రంథమందనేక లోపంబులుండవచ్చును. చదువరులా లోపంబుల కనుబరచిన ద్వితీయముద్రణములో సవరించుకొనుటయే కాక నిరతాభివందనము లాచరించుచుండెద

ఇట్లు విధేయుడు,

భిషగాచార్య పండిత హెచ్ సుబ్బరాయశాస్త్రి,

కవిరత్న.

ఇమాంబావిడివీధి,
సికిందాబాదు.
సెప్టెంబరు 1916.

# విషయసూచిక.

(*Contents*)

అధ్యాయము i.

అస్థిపంజరము (*Skeleton.*) అస్థులసంఖ్య— వాటిభేదములు-అస్థులవివరము. ౧-౭ పుటలు.

అధ్యాయము ii.

సంధులు, సంధిబంధనములు, (*Joints and Ligaments*) సంధుల భేదములు—బహుచేష్టాసంధులయొక్క- వివరము—సంధుల పేళ్లు-సంధులకృత్యము- దేహములోనవియుండుస్థలములు. ౮-౧౦పు.

అధ్యాయము iii.

కండరములు (*Muscles*) కండర భేదములు-వాటికృత్యములు. ౧౧ పు.

అధ్యాయము iv.

బంధనములు (*Bandages*) బంధనములయొక్క గుణదోషములు-బంధనభేదములు, ఆకారము, బంధించుస్థలములు. ౧౨-౧౬ పు.

అధ్యాయము v.

అస్థిభగ్నము (*Fracture of Bones.*) కారణములు-భేదములు కాండభగ్న సామాన్యలక్షణములు-కాండభగ్న భేదములు-తల్లక్షణములు, ఆకారములు- కాండభగ్నచికిత్సలు-సంధిభగ్నము (*Dislocations*) సంధిభగ్నసమాన్యలక్షణములు, కాండభగ్నమునకును, సంధిభగ్నమునకును, కలభేదములు-సంధిభ

గ్న చికిత్సలు-అసాధ్య అస్థిభగ్న లక్షణములు. ౧౬-౨౨.

అధ్యాయము vi.

వ్రణములు (*Wounds and Bruises*) వ్రణలక్షణములు, వ్రణభేదములు-ఆగంతుక వ్రణములు-వాటి నామములు-ఛిన్న భిన్న వ్రణముల చికిత్సలు-పిద్ధవ్రణ చికిత్సలు-క్షతపిచ్ఛిత వ్రణముల చికిత్సలు. ౨౨-౨౫.

అధ్యాయము vii.

అగ్నిదగ్ధ వ్రణములు (*Burns and Scalds.*) అగ్నిదగ్ధవ్రణభేదములు-చికిత్సలు-నిప్పుచేకాలుచుండు యిండ్లనుండి ప్రాణులకాపాడు విధము-అస్థిభగ్న, వ్రణ, అగ్నిదగ్ధ చికిత్సలయందవశ్యముగానుండవలసిన వస్తువులు. ౨౫-౨౮.

అధ్యాయము viii.

రక్తస్రావము (*Hemorrhage*) కారణములు-శుద్ధరక్తముయొక్క-సామాన్యలక్షణములు-వాత, పిత్త, కఫరక్తలక్షణములు-రక్తస్రావమందు చేయదగినవిధులు- చికిత్సలు. ౨౮-౩౨.

అధ్యాయము ix.

దేహములోశల్యములు ప్రవేశించుట (*Intestinal and other Obstructions*) ప్రతిలోమలక్షణములు-అనులోమ లక్షణములు-ప్రతిలోమచికిత్స-అనులోమ చికిత్స-కంఠగత శల్యచికిత్స-ముఖనాసికాగత శల్యచికిత్స-నేత్రగతశల్య చికిత్స-కర్ణగతశల్య చికిత్స-ఉంగరములు వ్రేళ్లలోతగులుకొని బాధించుచుండినందుకు చికిత్స-లోహాదులు కడుపులోప్రవేశించినందుకు చికిత్స. ౩౨-౩౬.

అధ్యాయము x.

తటాకపతన చికిత్సలు (*Drowning*) రక్షకులు గమనించవలశిన ముఖ్యాంశములు - ప్రాణిని నీటిలోనుండి బయటతెచ్చిన వెంటనే చేయదగిన విధులు - శ్వాసింప చేయుక్రమము (*Artificial respiration*) - ఉరిపోసికొనుట. ౩౬-౪౦.

అధ్యాయము xi.

విషములు (*Poisons*) విషభేదములు - త్రివిధవిష సామాన్యలక్షణములు - స్థావరవిషచికిత్సలు - జంగమవిషచికిత్సలు. ౪౦-౫౪.

అధ్యాయము xii.

వాతరోగములు (*Nervous Diseases*) కారణములు - సామాన్యలక్షణములు - బలవత్తరమైన వాతభేదములు - తల్లక్షణములు - రక్షలువేయుస్థలములు - వాతహార చికిత్సలు ౫౪-౬౦.

అధ్యాయము xiii.

ప్రసవములు, ప్రసవోపచారములు, (*Midwifery and management of Labour*) స్త్రీప్రసవించునని తెలియజేయు లక్షణములు - స్త్రీప్రసవముయొక్క మూడుభాగములు - ప్రథమ, ద్వితీయ, తృతీయావస్థలయొక్క స్థితులు - ప్రసవసమయమందు సిద్ధపరుపవలసినవస్తువులు - ప్రసవసమయమందు కావించవలసిన విధులు - నాభినాళముఛేదించు విధము - శిశువుకు ఉపచారములు స్తన్యదుగ్ధము - సూతికోపచారములు, కష్టప్రసవములు - సూతికారోగము, చికిత్సలు. ౬౧-౭౨.

చికిత్సాయోగములు. (*Recipes*) i——xxi

# చిత్రపటములు.

(*List of Illustrations*)


| బంధనములు. | | పుట. |
|---|---|---|
| ౧. కోశబంధనము | | ౧౪ |
| ౨. స్వస్తిక | ,, | ,, |
| ౩. ముత్తోళి | ,, | ,, |
| ౪. చీన | ,, | ,, |
| ౫ దామ | ,, | ,, |
| ౬. అనువేల్లిత | ,, | ,, |
| ౭. ఖట్వా | ,, | ౧౫ |
| ౮. విబంధనము | | ,, |
| ౯. స్థగితబంధనము | | ,, |
| ౧౦. వితాన | ,, | ,, |
| ౧౧. ఉత్సరంగ | ,, | ,, |
| ౧౨. గోఫణా | ,, | ,, |
| ౧౩. యమక | ,, | ౧౬ |
| ౧౪. మండల | ,, | ,, |
| ౧౫. పంచాంగి | ,, | ,, |
| **అస్థిభగ్నములు.** | | |
| ౧౬. కర్కటక భగ్నము | | ౧౭ |
| ౧౭. అశ్వకర్ణ | ,, | ,, |
| ౧౮ విచూర్ణిత | ,, | ,, |
| ౧౯ పిచ్చిత | ,, | ౧౮ |

| అస్థిభగ్నములు. | | పుట |
|---|---|---|
| ౨౦. అస్థిచ్ఛల్లిక భగ్నము | | ౧౮ |
| ౨౧. కాండ | ,, | ,, |
| ౨౨. మజ్జానుగత | ,, | ,, |
| ౨౩. అతిపాతిత | ,, | ,, |
| ౨౪. స్ఫుటిత | ,, | ,, |
| ౨౫. వక్ర | ,, | ౧౯ |
| ౨౬. భిన్న | ,, | ,, |
| ౨౭. పాటిత | ,, | ,, |
| **శస్త్రములు.** | | |
| ౨౮. ఏషణీ శస్త్రము | | ౨౮ |
| ౨౯. మండలాగ్ర | ,, | ,, |
| ౩౦. వృద్ధిపత్ర | ,, | ,, |
| ౩౧. నఖ | ,, | ,, |
| ౩౨. దంతలేఖన | ,, | ,, |
| ౩౩. సూచీ | ,, | ,, |
| ౩౪. సందంశయంత్రము | | ౨౯ |
| ౩౫. శృంగ | ,, | ,, |
| ౩౬. అర్ధచంద్రానన శస్త్రము | | |
| ౩౭. కర్తరీశస్త్రము | | ,, |
| ౩౮. బడిశ | ,, | ,, |

# అధ్యాయము 1

## అస్థిపంజరము (Skeleton.)

అస్థిపంజరమనగా దేహమును ధరించు ఎముకల చట్టము. ఇది దేహములోని కండలను బంధించును, అంగములను కాపాడుచుండును.

సుశ్రుత శారీరము ౫ అధ్యాయములో యీరీతిగ చెప్పబడినది.

శ్లో॥ అభ్యన్తర గతైస్సారైర్య థాతిష్ఠన్తి భూరుహాః।
అస్థిసారైస్తథా దేహా ధ్రియన్తే దేహినాం ధ్రువం॥

లోభాగముననుండు సారాంశమువలన వృక్షములు దృఢముగనుండుచందంబున అస్థులయొక్క సారాంశమువలన బ్రాణులయొక్క దేహములు దృఢముగ నుండును.

కనుక దేహధారణమునకు ముఖ్యముగనుండు అస్థుల నిర్మాణవిషయమై మొదలు గ్రహించవలెను.

మనుష్య దేహములో 3౬౦ ఎముకలు కలవని ప్రాచీనులు కనుగొనినటుల యీక్రింది ఆధారములవలన తెలియుచున్నది.

"త్రీణిచశతానిషష్టిశ్చపురుషస్యాస్థీని" (శత. బ్ర ౧౨ 3. ౨.3)
"అస్థీనిచహవై త్రీణిశతానిషష్టిః" (గర్భోపనిషత్.)

"తథాచసహషష్ట్యాశతత్రయం" (యాజ్ఞవల్క్య ౩.౭౮౧)

అయినను సుశ్రుతాచార్యులుమాత్రము శారీర ౫ అధ్యాయములో "త్రీణిసషష్టీన్యస్థిశతాని వేదవాదినోభాషన్తే" వేదవాదినులగు మహర్షులు ౩౬౦ అస్థులుకలవని నుడివినను, అదే అధ్యాయములో "శల్యతంత్రే తుత్రీణ్యే వాస్థిశతాని" ౩౦౦ అస్థులుకలవనియే చెప్పియున్నారు.

ప్రత్యక్షశారీరప్రకారమాధునికులలో కొందరు ౨౦౦ అస్థులనియు, మరికొందరు ౨౮౦ అనియు నుడివియున్నారు. దీనికి కారణమేమన కొందరు లెక్కపెట్టుచుండు దంతములు తరుణాస్థులు మొదలగునవి, మరికొందరు లెక్కపెట్టకుండుటయే యని దోచుచున్నది.

సుశ్రుతశారీరప్రకారము అస్థులీవిధముగ విభజింపబడినవి.

"కపాల, రుచక, తరుణ, వలయ, నలక, సంజ్ఞాని"

| | ఎముకల భేదము. | ఎముకలుండుస్థలము | ఎముకలయొక్క చేష్ట |
|---|---|---|---|
| ౧ | కపాలాస్థులు | శిరస్సు<br>కణతలు<br>చెక్కిళ్లు<br>భుజశిరస్సులు<br>పిరుదులు<br>మోకాళ్లు | తునియలగుటయు, చీల్పబడుటయు కలదు. |

| | ఎముకల భేదము. | ఎముకలుండుస్థలము | ఎముకలయొక్క చేష్ట |
|---|---|---|---|
| ౨ | తరుణాస్థులు | కన్నులు<br>చెవులు<br>ముక్కు | వంగును |
| ౩ | రుచకములు | పండ్లు | చిట్లును |
| ౪ | వలయాస్థులు | గొంతు<br>వీపు<br>ఇరుప్రక్కలు<br>చేతులు<br>కాళ్లు | పగులును. |
| ౫ | నలకములు | మీచెయ్యి<br>ముంజెయ్యి<br>తొడ<br>మోకాళ్లు | విరుగును |

## కపలాస్థుల వివరము

శిరస్సు—లేక తలపుఱ్ఱె అనునది చెవియెముకలు రెండును కాక ౬ యెముకలతో నిర్మింపబడిన ఒకపెట్టె. ఇది మెదడును పైభాగమునంతయు ఆవరించి కాపాడుచుండును. ఈయెముకలు ఒకటికొకటి సంధించు స్థలములయందు వంకరగాను, నొక్కులు కలవిగా నుండును. దీనినే బ్రహ్మలిపియని భ్రమించెదరు.

కణతలు—కణతలకు, సంబంధించిన ఎముకలు రెండును తలపుఱ్ఱెకు క్రిందుగను, ప్రక్కగనుంచబడి చెవికి సంబంధించిన అంగములను కలిగియుండును.

చెక్కిళ్లు—పైదవడ భాగమున ఒక వంకరగానుండు ఎముకయు, క్రిందిదవడభాగమున ఒకటియు నుండును. ఇవి చెక్కిళ్ల ప్రదేశమందు సంధించును.

భుజశిరస్సులు—ఇవిచంకలవెనుభాగమున ఒక్కొక వైపున నొకటియుంచబడి భుజశిరస్సునందు మోజెయ్యితో సంధించును.

పిరుదులు—నడుముప్రదేశమున మూత్రకోశము, గర్భకోశము పేగులుఅనువాటిని కాపాడుచున్న రెండుఎముక

లకు పిరుదులని పేరు. ఇవి క్రిందిభాగములో తొడ ఎముకలతోను, వెనుభాగములో వెన్నెముకతోను సంధించును.

మోకాటిచిప్పలు — అనునవి రెండును మోకాలు భాగమున రెండుకాళ్లకు రెండు ఎముకలుండును.

తరుణాస్థుల వివరము.

ముఖభాగమందు ముక్కుకు, చెవికి, నోటికి కన్నులకు సంబంధించిన ౧౪ యెముకలు కలవు. ఇవి అన్నియు మృదువుగనుండుటం బట్టివంగును.

రుచకముల వివరము.

నోటిలో పైభాగమున ౧౬ను క్రిందిభాగమున ౧౬ను పండ్లుగలవు. ఇవిచిట్లును గనుక రుచకములనబడును.

వలయాస్థుల వివరము.

గొంతుఎముకలు — గొంతుదగ్గర కంఠెఎముకలను రెండెముకలును రొమ్ముకుపైన నిడుపుగానుండు ఒక ఎముకయు కలదు. ఈకంఠెఎముకలు రొమ్ముఎముకతోను, భుజశిరస్సుతోను సంధించును. దేహములోని అన్ని ఎముకలలో యీఎముకకు విశేషముగా అపాయము కలుగుచుండును.

వీపు—వీపులో గొంతుదగ్గరనుంచి ఆసనమువరకు 33 చిన్న ఎముకల దండకలదు. దీనినే బ్రహ్మదండమునికూడ చెప్పుచున్నారు. ఇందులోకొన్ని వయస్సురానురాను ఒక్కటికొకటి అతుకుకొనుటవలన మధ్యవయస్సునందు ౨౬ ఎముకలు మాత్రము కలిగియుండును. ఇది త్రిప్పుట, దేహమును నిలువబెట్టుట, వంచుట మొద లగు కార్యముల కనుకూలించియుండును. దీని మధ్య లో నొక రంధ్రముకలదు. ఈ రంధ్రములోపల మెదడులోని కొంతభాగము వ్యాపించి యుండును.

ఇరుప్రక్కలు—ఈప్రదేశములో ఒక్కొక ప్రక్కన ౧౨ ఎముకలు గలవు. ఇవి వెన్నెముకలతో సంధించి యుం డును. ఇవి యుండుటచేతనే రొమ్మునొక్క లోభా గము గుహవలెయేర్పడి హృదయము, శ్వాసకోశము లు మొదలగు అంగములను కాపాడుచుండును.

హస్తము—ఒక్కొక హస్తమునందు మణికట్టుభాగములో ౮ ఎముకలును, అరచేతిలో ౫ ఎముకలుండును. అంగు ష్ఠమున రెండు ఎముకలును, తక్కిన వ్రేళ్లలో ఒక్కొ క దానికి 3 ఎముకలుండును.

పాదము—ఒక్కొకపాదములో చీలమండల భాగమున ౭ ఎ

ముకలును అరకాలులోను, పాదాంగుష్ఠమున రెండును, తక్కిన వ్రేళ్లలో మూడునుండును.

నలకముల వివరము.

మీఁజెయ్యి—ఒక్కొక చేతియొక్క పైభాగములో గుండ్రముగ, పొడవుగనుండు ఎముకయొకటికలదు. పైభాగము భుజపుటెముకతోను క్రిందిభాగము ముంజేతి ఎముకతోను సంధించును.

సంధులు సంధిబంధనములు.

ముంజెయ్యి—దీనినే మూరచెయ్యి అనుచున్నారు. ఒక్కొక చేతిలో ౨ ఎముకలుగలవు. ఇది మోచేతికిని హస్తమునకును మధ్యనుండును.

తొడ—దేహములోని ఎముకలకంటెను మిక్కిలి గొప్పదైనఎముక తొడఎముక. ఒక్కొకతొడలో ఒకఎముకయుండును. ఇవిపైభాగమున నడుము ఎముకలలోనుండు గుంతలో తిరుగుటకనువుగనుండునటుల సంధించును. క్రిందిభాగమున మోకాలుఎముకతో సంధించును.

మోకాలు—ఒకొక్క మోకాలులో ఒకటిపెద్దది, మరియొకటి చిన్నదైన రెండెముకలుగలవు. ఇవి పైభాగమున

తొడఎముకతోను, క్రిందిభాగమున పాదములతో
ను సంధించును.

## అధ్యాయము II.

### సంధులు, సంధిబంధనములు

### (*Joints and Ligaments*)

ఒక ఎముకయు, మరియొక ఎముకయు కలియు స్థల
మునకు సంధియని పేరు. యీసంధులుమూడు విధములుగా
నుండును.

౧. బహుచేష్టా (*Movable Joints*) ఉ॥ క్రింది దవుడసంధి
౨. అల్ప చేష్టా (*Mixed articulations*) వెన్నెముక
3. అచేష్టా (*Immovable joints*) ఉ॥ ప్రక్కఎముకలు

ఎముకలు ఒకటికాని, రెండుకాని, మూడుకాని చేరు
స్థలము స్నాయురజ్జువులు (*Ligaments*) తోకాని, స్నాయుకో
షములు (*Articular Capsules*) తోకాని కట్టబడియుండును.

ఎముకలు ఒకటితోనొకటి రాచుకొని అరిగిపోకుండు
టకై, వాటిమధ్య శ్లేష్మపూరితమైన ఒకపొరకలిగియుండును.
సుశ్రుత శా॥ ౫ అధ్యాయములో.-

„స్నేహాభ్యక్తేయథాత్వక్షే చక్రంసాధు ప్రవర్తతే।
సంధయఃసాధువర్తంతే సంశ్లిష్టాఃశ్లేష్మణాతథా॥”

బంతియొక్క చక్రమునకు కందినవేసిన నెటులఅరిగిపో కుండునో అట్టులనే ఈకళ యుండుటచే ఎముకలు రాచుకొని అరగిపోకుండునని భావార్థము.

బహుచేష్టాసంధులయొక్క వివరము

| | సంధుల పేళ్లు. | సంధుల కృత్యము. | దేహములోనివి ఉండుస్థలములు, |
|---|---|---|---|
| ౧ | సందంశ కోరములు లేక మడత బందు కీళ్లు (Hinge joints) | ఈసంధులు, వెను ముందు చలనము మాత్రము కలుగ జేయును. | మోచేయి, మో కాళ్లు, వ్రేళ్లు, చీల మండలము. |
| ౨ | చక్రకోరములు లేక బొంగ్రపుకీళ్లు (Pivot joints) | ఒకఎముక మునికిప లెనుండి దానిచుట్టు ను ఇంకొక ఎముక బొంగ్రమువలెతిరు గుచుండును. | వెన్నెముక యొ క్క రెండవ పూ సయు, తలయు |
| ౩ | ఖల్లకోరములు లేక తిరుగుడు కీళ్లు. (Condyloid Articulations) | ఎముకయొక్క కొం చెముగుండ్రముగా నుండు గుంతలోవే రొక ఎముకతిరుగు చుండును. | మణిబంధముయొ క్క యెముకలు. |

| | సంధుల పేళ్లు | సంధుల కృత్యము | దేహములో నివి ఉండుస్థలములు. |
|---|---|---|---|
| ౪ | పరస్పరకోరములు లేక గుండ్రపుకీళ్లు *(Saddle joints)* | గుండ్రముగనుండు ఎముకలు ఒకటిమీదనొకటిఅన్నివైపులనుదిరుగుచుండును. | హస్తాంగుష్ఠమూలము. |
| ౫ | ఉదూఖలములు లేక రోకలి కీళ్లు. *(Ball and socket joints)* | రోలువలెనుండు ఎముకలోరోకలివలె నుండు మరియొక ఎముక అన్నివైపుల దిరుగుచుండును | చంక ఎముకలు తొడసంధి |
| ౬ | ప్రతరా లేక పలక కీళ్లు *(Arthrodia)* | పలకవలె నుండు ఎముకలుఒకటిమీద నొకటిజారుచుండును. | అరచేతులు అరికాళ్లు |

# అధ్యాయము III

దేహములో సుమారు ౫౦౦ కండలు కలవు. ఇవి ఒక్కొక్కటియు మధ్యమున లావుగను, కొనలయందు సన్నగ నుండి సాధారణముగ ఎముకలను ఆవరించి యుండును. ఈకండలయొక్క కొనలకు కండరాగ్రములని పేరు. కండలలో కొన్ని లావుగను, సన్నగను, పలుచగను, గుండ్రము గను అనేక ఆకారములు కలిగియుండును. దేహముయొక్క కృత్యములన్నియు యీకండల మూలకమున జరుగుచుండును. మీాజెయ్యిని వంచ వలెననిన అచ్చటనుండు కండలు సంకోచముజెంది దానికొనలోనుండు అస్థివంచును భుజమును వంచ నేరదు. ఇటులనే కండలయొక్క కొనలు దేనికి సంబంధించియుండునో దానితోనే కార్యములు జరుగుచుండును. కండలు స్వతంత్రములని (*Voluntary*), పరతంత్రములని (*Involuntary*) రెండు విధములు. స్వతంత్ర కండరములు మనయిష్టముప్రకారము వర్తించుచుండును కాలుతో నడచుట, చేయిజాపుట, వేలును కదలించుట, కన్నుత్రిప్పుట మొదలగునవి ఉదాహరణములు.

పరతంత్ర కండరములు, యిచ్ఛకధీనమైనవి కావు. ఇవి.

దేహములోపలి కృత్యములు అనగా, ఆహారము జీర్ణించుట, రక్తప్రసారము జేయుట మొదలగు కృత్యములు చేయుచుండును.

# అధ్యాయము IV.

## బంధనములు. (*Bandages*)

కాలు, చేయి మొదలగు అంగములు విరిగినప్పుడుగాని, వ్రణములు మొదలగు గాయములు కలిగినప్పుడుకాని, బట్టలతోనైనను, వృక్షములపట్టలతోనైనను, తోళ్లతోనైనను ఆయాస్థలములయందు బిగువుగనుండునటుల గట్టుట బంధనమనబడును. బంధనములు దృఢ, సమ, శిథిలబంధనములని మూడువిధములు.

| | | | |
|---|---|---|---|
| దృఢబంధనమునకు | స్థానములు | . | తొడలు, పిరుదులు, చంకలు, గజ్జలు, శిరస్సు. |
| సమ | ,, | ,, | : కాళ్లు, చేతులు, ముఖము, చెవులు, రొమ్ము, పృష్ఠము, పార్శ్వములు, కంఠము, ఉదరము, మేఢ్రము, వృషణములు. |
| శిథిల | ,, | ,, | : నేత్రములు, సంధులు. |

## బంధనములయొక్క గుణదోషములు.

| గుణములు. | లేకుండుటవలనదోషములు. |
|---|---|
| ౧. బంధనమువలన విరిగినఅస్థులుయథాస్థితిని జెంది కూడుకొనును. | ౧. విరిగినఅస్థులు బిగింపబడవు. |
| ౨. స్నాయువులు, సిరలు, మాంసములు, మొదలగునవి ఛేదింపబడినను బంధన మాహాత్మ్యముచే సుఖముగా కూడుకొనును. | ౨. ఈగలు, దోమలు, శీతము, పొగ, ధూళి, వీటివలన బాధ కలుగును. |
| 3. లేచుట, పరుండుట మొదలగు కృత్యములయందు పీడకలుగదు. | 3. విరిగినచోట ఔషధము పూసిన చిరకాలమువరకు నుండదు. |
| ౪. బంధనమువలననొప్పి, పోటు విశేషముగానుండదు. | ౪. బంధనములేక చికిత్సించిన వ్రణముండుస్థలముశరీరముకంటెవిరుద్ధ వర్ణము జెందును. |
| | ౫. లేచుట, పరుండుట యీ మొదలగు కృత్యములయందు విశేషబాధ చేయును. |

౧౮ బంధనభేదములు, ఆకారము, బంధించుస్థలములు.

1



కోశబంధనము. సంచివలెనుండునది. వ్రేళ్లగణుపులు.

2



స్వస్తికబంధనము కనుబొమలు, మణిబంధము, చెవులు, స్తనములు, చెక్కిళ్లు.

3



ముత్త్రోళిబంధనము. మెడ, మేఢ్రము.

4



చీనబంధనము. గాలిలోకదలు నట్లుండునది. కంటికోనలు.

5



దామబంధనము. మాలాకారముగల ది. సంధి, గజ్జెలు.

6



అనువేల్లితబంధనము. మెలిగలది చేతులు, కాళ్లు, శాఖలు.

7



ఖట్వా బంధనము.
మంచముగళ్లవంటిది.
సంధి, కటిమర్లు, చెక్కిళ్లు, కణతలు.

8



విబంధనము.
ఉచ్చువలెనుండునది.
తొడలు, వీపు, పృష్ఠము, కడుపు, వక్షస్థలము.

9



స్థగిత బంధనము
తమలపాకుచుట్టవలెకొనకలది
బొటనవ్రేళ్లు, మేఢ్రము, ఆంత్రవృద్ధి.

10



వితానబంధనము.
చాందినివలెనుండునది.
శిరస్సు.

11



ఉత్సరంగిబంధనము.
వ్రేలుచుండునది.
చేతులు.

12



గోఫణబంధనము.
ఆవుకొమ్మువలెనుండునది.
నాసిక, పెదవులు, గడ్డము, తొడల్లు.

| 13 | 14 | 15 |
| --- | --- | --- |
|  |  |  |
| యమకబంధనము. జంటగనుండునది. జంటవ్రణములు. | 1 మండలబంధనము.<br>2 వితాన ,,<br>3 యమక. ,,<br>4 విబంధనము. | పంచాంగిబంధనము ౫ భాగములుకలది మెడకొంకులకు పై భాగము. |

# అధ్యాయము V.

## అస్థిభగ్నము (*Fracture of bones.*)

కారణములు :—

పడుట, దెబ్బతగులుట మొదలగువాటివలన కీళ్లుజారుటయు, ఎముకలు విరుగుటయుకలదు.

భేదములు { సంధిభగ్నము (*Dislocations.*)<br>కాండభగ్నము (*Fractures.*)

అని రెండువిధములు. ఎచటనేనికీళ్లుజారిపోయిన సంధిభగ్నమనియు, కాండమువిరిగిపోయిన కాండభగ్నమనియు పేర్లు.

**కాండభగ్న సామాన్య లక్షణములు.**

౧. అవయవములు సడలియుండుట
౨. వాపు జెందుట.
౩. నొప్పి.
౪. చేతితో తాకిన నోర్వజాలకుండుట
౫. కదలించిన శబ్దము కలుగుట.
౬. సూదులు గ్రుచ్చినటుల పోట్లు.
౭. విరిగిన ఎముకలు కదులుచుండుట.

## కాండభగ్న భేదములు, తల్లక్షణములు, ఆకారములు.

1



కర్కటకము.

ఎముకకు నిరుప్రక్కల విరిగి మధ్యమునడున్న తం బైకను పడునది.

2



అశ్వకర్ణము.

ఎముక విరిగి గుజ్జుపు చెవివలె నున్నతముగ నుండునది.

3



విచూర్ణితము.

ఎముకనలిగి స్పృశించినయెడ మృదువుగ నుండునది.

4



పిచ్చితము.

ఎముకనలిగి వెడల్పుగనుండి అధికమైన వాపుకలిగినది.

5



అస్థిచ్ఛల్లికము.

ఎముక విరిగి మధ్యమున పల్లముగనుండి యిరుప్రక్కల ఉన్నతంబై యుండునది.

6



కాండభగ్నము.

ఎముకవిరిగి కదలించినయెడ పైకి పొడుచుకొనియుండునది

7



మజ్జానుగతము.

ఎముకలో ఒక భాగము విరిగి ఎముకలోపలనుండు మజ్జతో గలిసి మజ్జను సంచరించనీయక నడ్డగించునది.

8



అతిపాతితము.

ఎముకలు పలుదెరంగుల నలిగి రూపులేకుండునది.

9



స్ఫుటితము.

ఎముకనలిగి ముండ్లతో నిండియున్న విధంబుగ నుండునది.

10 11 12



వక్రము.

ఎముకలు రెండుతుని యలుగవిరగక వంగియుండునది.



భిన్నము.

ఎముకనొకభాగము నవిరిగి మరియొకభాగమున చేరి యుండునది.



పాటితము.

ఎముక ఒకభాగము లోపలు తెరంగుల చీలియుండునది.

చికిత్సలు:—

౧. వంగియుండుఅస్థిని పైకిద్రోయవలెను. పైకెత్తబడిన అస్థి నిక్రిందికిద్రోయవలెను.

౨. విరిగిన అస్థులొకటిపైనొకటి సమముగనుండునటులమాచుకొనవలెను.

3. తెల్లపట్టువస్త్రము లేకదూదివస్త్ర ఖండములను నేతిలోతడిపివిరిగినచోటచుట్టవలెను

౪. మేడి, రావి, జువ్వి మొదలగువృక్షముల యొక్కపట్టలనుగాని, జాజిపలకలనుగాని ఆవస్త్రముపైనుంచి గడ్డి, తీగెలు లేకదారములతోగాని ఆయాస్థలములకుతగినటుల బంధించవలెను.

౫. అస్థిభగ్నముచే రక్తనాళములు తెగి అత్యధికముగా రక్తము కారుచుండిన ఆవుపాలలో చక్కెరవేసి, కాచి, ఆవునెయ్యి పోసిచల్లార్చి లక్కను (లత్తుక) కలిపిపానము చేయించవలెను.

౬. విరిగినఅస్థులయొక్క కట్టును,

ఉష్ణకాలములో ౩ దినములకొకతూరివిప్పిమరల కట్టుచుండవలెను.
శీతకాలములో ౭ ,, ,,
సాధారణకాలములో ౫ ,, ,,

వ్రణముతోకూడియుండు భగ్నమును వ్రణచికిత్సలో చెప్పియుండు ప్రకారము చికిత్సింపవలయు. విరిగినఅస్థులు తరుణవయస్సుకలవారికి ౧ మాసములోను, మధ్య వయస్సుకలవారికి ౨ మాసములలోను, వృద్ధులకు ౩ మాసములలోను కూడుకొనును.

## సంధిభగ్నము (*Dislocations.*)

సంధిభగ్నసామాన్యలక్షణములు.

౧. సంధులుజారియుండుట.
౨. హస్తములచే స్పృశించిననోర్వజాలకుండుట.
౩ వాపు.
౪. నొప్పి.
౫. అశక్తత మొదలగునవి.

| కాండభగ్నము. | సంధిభగ్నము. |
|---|---|
| ౧. ఎముకలుమధ్యవిరుగును. | సంధుల దగ్గరవిరుగును. |
| ౨. ఎముకలు కదలించినశబ్దమగును. | శబ్దమగుటలేదు. |
| | విశేషముగ కదలుటలేదు. |
| 3. కదలించినకదులును. | విరిగిన సంధులు కుదిర్చిన మరలపడిపోవుటలేదు. |
| ౪. విరిగినఎముకలులాగియధాస్థానమందుంచినను మరల పడిపోవుచుండును | విరిగినసంధులభాగము కురుచబడుటలేదు. కొన్నిసమయములలో నిడుపుగనుండునటులకనుపించును. |
| ౫. విరిగినఎముకలభాగము కురుచబడును. | |

## సంధిభగ్నచికిత్సలు.

౧. ఏప్రక్కకు వంచినసంధులుకలియునో ఆప్రక్కన అంగములుంచునటులచేయవలెను.

౨. ఇటులుంచినను కలియకపోయిన విరిగిన సంధికొకవైపునఒకరును, మరియొకవైపున ఒకరును ఈడ్చిపట్టుకొని కీలునుసరిగాయుంచవలెను.

3. వాపు, నొప్పి యుండిన, మేడి, అత్తి, జువ్వి మొదలగునవి ఉదకములోకాచి అందులోకంబళివస్త్రమునద్ది వేడివేడిగాఒత్తడమివ్వవలెను.

౪. విరిగినచోటదూదియుంచి, దానిమీద మ్రానిపలకలు పెట్టి బిగియగట్టవలెను.

౫. పిదపకాండభగ్నమువలెనే చికిత్సించవలెను.

అసాధ్యఅస్థిభగ్నలక్షణములు.

౧. మూర్ఛ
౨. రొమ్మునొప్పి
౩. ప్రక్కశూల
౪. జ్వరము
౫. సర్వాంగతాపము
౬. దప్పి
౭ కడుపుబ్బరము
౮. అన్నమునందయిచ్ఛ
౯. మలమూత్రనిరోధము
౧౦ శ్వాసము
౧౧ చెమట
౧౨. నేత్రములయందురక్తవర్ణము
౧౩ నోటియందినుపవాసన
౧౪. శరీరమునదుర్గంధము
౧౫ నడుము, శిరస్కపాలము, కణతలు, వీపు, రొమ్ము, మొదలగు స్థలములయందస్థులు అనేకములుగ తునియలై యుండుట.

ఈపైలక్షణములుండినఅసాధ్యమని తెలియవలెను.

# అధ్యాయము. VI

## వ్రణములు (*Wounds, and Bruises.*)

దెబ్బలు మొదలగు కారణములచేతకలిగిన గాయములకు వ్రణములని పేరు.

వ్రణలక్షణములు. (౧) చీము, రక్తము స్రవించుచుండుట.
(౨) నొప్పి.
(౩) పోట్లు మొదలగునవి.

భేదములు ; (౧) వాత, పిత్త, శ్లేష్మాదులవలన కలుగునవి దోషజవ్రణములనబడును.
(౨) గాయములచేగాని శస్త్రములచేగాని కలిగినవి ఆగంతుకవ్రణములనబడును.

దోషజవ్రణములను దోషములను గుర్తెరిగినవారివద్ద చికిత్సింపవలయు.

ఆగంతుకవ్రణములు :—

| | | |
|---|---|---|
| ౧. ఛిన్నవ్రణము | | (నరుకబడుటచే కలిగినవ్రణము) |
| ౨ భిన్న | ,, | (పగులుటచే కలిగినవ్రణము) |
| ౩. విద్ధ | ,, | (శల్యము గ్రుచ్చుకొనుట వలన కలిగినవ్రణము) |
| ౪. క్షత | ,, | (గాయముచే కలిగిన వ్రణము) |
| ౫. పిచ్ఛిత | ,, | (నలుగుటచే కలిగిన ,, ) |
| ౬. ఘృష్ట | ,, | (రాపిడిచే కలిగిన ,, ) |

భిన్నభిన్న వ్రణములచికిత్సలు.

౧. ఎండినరక్తము, గడ్డి, వెంట్రుకలు మొదలగువాటి నెత్తి పారవేయవలెను.

౨. కోయబడి వ్రేలుచుండు మాంసమును, సంధిని, అస్థినిస్వ స్థానమందుంచవలెను.

3. వ్రణమునకు యిటునటునుండుచర్మమును యో॥ ౫ తో కడిగి శుద్ధిచేసి జంతువులనరములతో గాని, పింజిబంత మొదలగుచెట్ల దారములతోగాని, పట్టుసూత్రముల తోగాని, సూచీశస్త్రముతో కుట్టవలెను

కుట్టుటయందు గమనించవలసిన విషయములు :—

*a.* అతిసమీపమున లేక అతిదూరమున కుట్టకూడదు.

*b.* వ్రణభాగము మిగులఅల్పముగగాని అధికముగగాని తీసుకొనక మితముగతీసుకొని కుట్టవలెను.

౪. అయిదవయోగమునచెప్పియుండు శీతకషాయమును పైన చల్లవలెను.

౫. యో॥ ౧3, ౧౪, ౧౫, లో దేనినైనను లేపనముచేయ వలెను.

విద్ధవ్రణ చికిత్సలు.

౧. మొదటశీతోదకమును చల్లవలెను.

౨. సిరలకపాయముకలుగకుండ శరీరమున గుచ్చుకొనియుండు శల్యముల, చేతితోగాని, పటకారుతోగాని యుక్తిగతీయవలెను.

3. వ్రణముపై ఎఱ్ఱమన్నుబూసి దర్భలుపెట్టి కట్టుగట్టి పిదప మంజిష్ఠ, అతిమధురము, నిమ్మపండ్లరసముతో నూరి లేపనముచేసి నేతిలోబియ్యపుపిండిని కలిపి పూసిబంధించవలెను.

## క్షత, పిచ్ఛిత వ్రణములచికిత్సలు.

౧ యో ౫ లో చెప్పినకషాయముతోకడుగవలెను.

౨. ౪, ౬, ౭, ౯, ౧౧ యోగములలో దేనినేని లేపనము చేయవలెను.

3. కట్టుకట్టవలెను.

# అధ్యాయము VII.

## అగ్నిదగ్ధ వ్రణములు (*Burns and Scalds*)

అగ్నిచేతను, కాచబడినతైలము, లోహశలాకాదులచేతను, కలిగినవ్రణములు అగ్నిదగ్ధవ్రణములనబడును.

## అగ్నిదగ్ధ వ్రణభేదములు.

౧. ప్లుష్టము (చర్మమువివర్ణంబగువరకు కాలునది.)

౨. దుర్దగ్ధము (కాలినదానిపై బొబ్బలుకలిగి తీవ్రదాహము-వేదనతోకూడుకొని యుండునది)

3. సమ్యగ్దగ్ధము (లోతైనమూలము, తాటిపండువర్ణముచు కలిగి బొబ్బలతో వ్యాప్తంబై యుండునది)
౪. అతిదగ్ధము (చర్మ, మాంస, సిరా, స్నాయు, సంధి, అస్థుల నుదహింపచేయునది)

చికిత్సలు.

౧. క్రిందపడి పొర్లాడవలెను. పరుగెత్తకూడదు.
౨. దేహమునకు అగ్ని అంటుకొనిన వెంటనే ఒకదళముగలబట్టను పైనకప్పుటవలనగాని, మట్టిచల్లుటవలనగాని ఆర్పవలెను. ఉదకము నేమాత్రమును చల్లకూడదు.
3. ౧౭, ౧౮, ౧౯, ౨౦, ౨౧, యోగములలో చెప్పియుండువాటిని లేపనము చేయవలెను.

నిప్పుచేకాలుచుండు యిండ్లనుండి ప్రాణుల కాపాడువిధము.

౧. మొదటఊపిరిబిగయపట్టి లోపలప్రవేశించవలెను.
౨. వెంటనే ఎదురైనగోడనుగాని తలుపులనుగాని పగులకొట్టి బయటికిరంధ్రముచేయవలెను.
3. మరలఊపిరిపీల్చి యిటులనేచేయవలెను ఏమాత్రమైనను లోపలనుండు పొగనుపీల్చకూడదు.
౪. ఒకవేళ గోడలను పగులగొట్టునంతలో ఊపిరిబిగియబట్టు

టకుసాధ్యముకానిచో తడిబట్టను ముఖమునకు వేసుకొని పీల్చవచ్చును.

ఈప్రకారము ప్రాణులను వెదకి వెలుపలికి చేర్చవలెను. అయినను గొప్పయిండ్లకునిప్పంటుకొనిన యీపద్ధతి సాధ్యముకాదు.

### అస్థిభగ్న, వ్రణ, అగ్నిదగ్ధచికిత్సల యందవశ్యముగా ఉండవలసిన వస్తువులు.

౧ అవికాజనము (మేకచర్మము)
౨ పట్టు, బూరుగదూది, ప్రత్తినూలు మొదలగువాటిచే చేయబడిన వస్త్రఖండములు.
3 ప్రమానిపలకలు
౪ వృక్షములయొక్క పట్టలు
౫ వెదురుమొదలగువాటిబద్దలు
౬ భుజపత్రి
౭ అలాబు శకలము (సొరకాయపైతోలు)
౮ లతలు (తీగెమొదలగు వాటితీగెలు)
౯ రజ్జువు (త్రాళ్లు)
౧౦ దూది
౧౧ పాలమీగడలేకనెయ్యి
౧౨ ప్లోతము (Swab)
౧౩ సాంబ్రాణి (Benzoin)
౧౪ సూత్రము (Thread)
౧౫ పట్టము (Tow)
౧౬ తేనె (Honey)
౧౭ కొవ్వు (Lard)
౧౮ నూనె (Oil)
౧౯ కపళికలు (Splints)

౨౦



ఏషణీశస్త్రము

(*Probe and Director.*)

౨౧



మండలాగ్రశస్త్రము

(*abcess lancet*)

౨౨



వృద్ధిపత్రశస్త్రము

(*Razor.*)

౨౩



నఖశస్త్రము

(*Nail Trimmer*)

౨౪



దంతలేఖనశస్త్రము

(*Gum Lancet.*)

౨౫



సూచీశస్త్రము

(*Needle*)

౨౬ ౨౭ ౨౮







సంధానశయంత్రము (The forceps.)

శృంగియంత్రము (Syringe)

అర్ధచంద్రాననశస్త్రము (Abcess Knife)

౨౯ 30





కర్తరీశస్త్రము (Scissors)

బడిశశస్త్రము (Tenaculum)

# అధ్యాయము. VIII.

## రక్తస్రావము (Hemmorage)

### కారణములు.

దెబ్బలచేతను, గాయములచేతను, దోషాధిక్యముచేతను, శరీర బాహ్యమందును, ముక్కు, నోరు మొదలగు ఊర్ధ్వదా

యమమూలకమునను, మలమూత్రమార్గములు మొ॥లగు అధోకాయమూలకమునను రక్తస్రావము కలుగును.

శుద్ధరక్తముయొక్క సామాన్యలక్షణములు.

(౧) ఒకింతవేడిగానుండుట.

(౨) ద్రవముగానుండుట

(౩) ఎఱ్ఱగనుండుట.

| వాతరక్తలక్షణము | పిత్తరక్తలక్షణము | కఫరక్తలక్షణము |
|---|---|---|
| (౧) శ్యామవర్ణము | పీతవర్ణము | తెలుపువర్ణము |
| (౨) రూక్ష | నల్లవర్ణము | స్నిగ్ధము |
| (౩) తీవ్రమైనస్రావము | దుర్గంధము | గట్టిగనుండుట |
| (౪) నైర్మల్యము | దట్టముగ నుండుట | తంతువులతోకూడిగనుండుట. |
| (౫) నురుగుతో కూడియుండుట. | | |

శరీరములో గాయమువలనగాని, పుండ్లవలనగాని రక్తము కారుచుండిన :—

౧. రక్తముఎచటనుండివచ్చుచున్నదని మొదటకనుగొనవలెను. ఆస్థలముహృదయముకన్నను పైగా ఉండునట్లు చేయవలెను.

౨. దేహములో ఎఱ్ఱగనుండు శుద్ధరక్తమైన, రక్తముకారుస్థలమునకు పైగాగట్టిగబంధించి ఆస్థలమునందు వ్రేలితో అదిమి పట్టవలెను. కొంతకాలమైనతరువాత శీతోదకముతో కడిగి, తడిబట్టనుకట్టవలెను.

౩. దేహములోని నల్లగనుండు అశుద్ధరక్తమైన, గాయమునకు క్రిందబిగియగట్టవలెను తరువాత పైచికిత్సలేచేయవలెను.

౪. ఇంతకునురక్తస్రావమునిలువకున్న ఆభాగములోనికొంతచర్మమును, మాంసమును, నాళములను చేతితో బిగియబట్టిదారముతో గట్టిగబంధించవలెను.

చికిత్సలు.

౧. తరువాత యో॥ ౨౪, ౨౩, ౨౨, ౧౬, లేపనము చేయవలెను.

౨. ఊర్ధ్వగతరక్తపిత్తమునకు తొలుత యో॥ ౨౯ వలనవిరేచనముచేయించిపిదప ౨౫, ౨౬, ౨౭, ౨౮, ౩౦ త్రాపించవలెను.

౩. అధోగతరక్తపిత్తమునకు తొలుత యో॥ ౩౧ వలనవమనముచేయించి పిదప యో॥ ౩౨, ౩౩, త్రాపించవలెను.

౪ వెడలినరక్తము ఉంటలుఉంటలుగాపడుచుండిన యో॥ ౩౪, ౩౫, నాకించవలెను.

౫. మూత్రమార్గమున రక్తము పడుచుండిన యో॥ ౩౬, ౩౭, తాపించవలెను.

౬. ముక్కులోరక్తముకారుచుండిన యో॥ ౩౮, ౨౪, పిండవలెను. తరువాత యో॥ ౩౯, శిరస్సుకు లేపనముచేయవలెను. పిడకకు నీళ్లుపోసి వాసనచూచినను, లేక ఖాడిచేశిముక్కులోఊదినను రక్తముకారుటనిలుచును.

# అధ్యాయము. IX.

## దేహములో శల్యములు (అనగా లోహములు, వెదురు, ఱాళ్లు, ఎముకలు మొదలగునవి ప్రవేశించుట)

(*Intestinal and other obstructions.*)

ప్రతిలోమలక్షణములు (శరీరాంతఃప్రవేశము లేకుండిన)

౧. ఎరుపువర్ణము, ౨. వాపు, ౩. నొప్పి, ౪. పలుమారురక్తముస్రవించుట. ౫. మృదువైన మాంసముకలదిగనుండు వ్రణమేర్పడుట.

అనులోమలక్షణములు (కోష్ఠముజెందినప్పుడు)

౧. క్షోభ, ౨. కడుపుబ్బరము, ౩. అల్పముగమలమూత్రము

లువచ్చుట, ౪. శరీరముచచ్చుబారుట, ౫. గురుత్వము, ౬. చమట, ౭ మూర్ఛ, ౮. వాంతి, ౯. శ్వాసము.

ప్రతిలోమచికిత్స.

౧. శల్యముగ్రుచ్చుకొనినచోట నీటితోకడుగవలెను.

౨. కనబడుచుండు శల్యమును హస్తముతోగాని, సందంశమనుయంత్రము (కమ్మరవాని పటకారు) తోగానితీయవలెను.

3. రక్తముస్రవించుచుండిన, వ్రణములకు చెప్పినచికిత్సలు చేసిబంధించవలెను.

అనులోమచికిత్స.

౧. ఆముదము లేకయితరవిరేచనవస్తువులిచ్చుటచే విరేచనము చేయించవలెను.

౨. వ్రేలునుఅంగటిలో ప్రవేశింపచేసి శల్యమునుకనుగొని వ్రేలితోబయటపరుచవలెను.

కంఠగతశల్యచికిత్స.

3. నూలుదారమును తామరతూండ్లకు చుట్టికంఠమునందుప్రవేశింపచేయవలెను. ఇటులప్రవేశింపజేసిన సన్నగను, మొనకలిగినదిగనుండు శల్యముతామరతూడుకంటుకొ

నిన వెంటనే వెలుపలనుండుసూత్రమునులాగవలెను.

౪. ఎముకలు మొదలగుగట్టి పదార్థములు కంఠమునప్రవేశిం చిన వెంట్రుకలచుట్టను నూలుతోకట్టి ఉప్పునీళ్లతో గాని, మంగిపండ్లచూర్ణముతోగాని ఆవెంట్రుకలను మ్రింగచేయవలెను. వమనమగునప్పుడు వెలుపలపట్టు కొన్న దారమునులాగిన ఆశల్యము వెలిపడును.

౫. వెంట్రుకలు ఆహారముతోకూడ గొంతులోప్రవేశించి బా ధించుచుండిన ఒకసన్నకట్టెపుల్లకుగాని, తామరతూడు కుగాని దారముగట్టి వాంతి కలిగించుపదార్థములతో మ్రింగజేసి వాంతియగునప్పుడు దారమునులాగిన వెం ట్రుకలు ఆకట్టెకుచుట్టుకొని వెలుపలికివచ్చును.

ముఖనాసికాగతశల్యచికిత్స.

శల్యము నోటిలోప్రవేశించిన చేతితోగానిపటకారుతోగానితీ యుటకుసాధ్యముకానియెడల, ఉదకపానము, భుజశిర స్సులమీద, మెడమీదకొట్టుటవీటిచేకడుపులోప్రవేశిం చునటులచేసి విరేచనమునకివ్వవలెను.

ముక్కులోప్రవేశించిన సాధ్యమైనచో సన్నపటకారుతో లాగ వలెను. లేకున్నశల్యముపీల్చునటులచేయవలెను.

కంటిరెప్పలనెత్తి పట్టి, తెల్లపట్టువస్త్రముతోగాని, ఊదుట చేత గాని, ఉదకముచేతగాని వెలిపరుపవలయును. కంటినే మాత్రము రుద్దకూడదు. నీళ్లలోముఖమునుముంచి కండ్లను తెరచినకంటిలోపలివస్తువుపడిపోవును.

## కర్ణగతశల్యచికిత్స.

(౧) కర్ణమువంచిపైనకొట్టవలెను.

(౨) తైలము, ఉదకము యీ రెండును చక్కగ కలిపి చిమ్మెన గొట్టముతో చెవిలోనికి చిమ్మివంచవలెను.

ఉంగరములు వ్రేళ్లలో తగులుకొని బాధించుచుండిన:—

౧. వ్రేలికిసబ్బు (*Soap*) నీళ్లుపట్టించిలాగవలెను.

౨. వ్రేలికొననుండిదారము పైకికట్టుచువచ్చితుదకు ఉంగరము లోనికిదారముయీడ్చి ఉంగరమునుక్రిందికిత్రోసినదారముయొక్కబిగువువలన వ్రేలు సన్నగిలుటచే ఉంగరముపడిపోవును.

3. ఉంగరములోనికి చిన్నతగుడు రేకును ఎక్కించి పైనఆకురాయితో రాచిన ఉంగరమువిరిగి ఊడివచ్చును.

## లోహాదులుకడుపులోప్రవేశించుట.

లక్క, స్వర్ణము, వెండి, తామ్రముమొదలైనవి కడుపులోభో

యిన విరేచనములచే వెలిపరుచవలెను. ఇవిఒకవేళశరీరములోకొంచముగా ఉన్నను శరీరములోనుండుఉష్ణముచేతనేకరిగిపోవుచుండును అయినను పైజెప్పినచికిత్సంవలన నవివిషతుల్యముగ కానేరవు.

# అధ్యాయము. X.

## తటాకపతనచికిత్సలు.

*(Drowning.)*

భావులు, చెరువులు మొదలగు జలాశయములయందుబడినవారిని రక్షించుటయందు చాలాజాగ్రతకలిగి యుండవలెను. ఇట్టివిపత్తులు సాధారణముగ మూడువిధములుగకలుగును.

౧. కాలుజారిపడుట, లేక వేరొకరిచే త్రోయబడుట.

౨. ప్రాణత్యాగముచేసికొనుటకై దేహమందు ఱాళ్లుమొదలగు భారముగలవస్తువుల ధరించుకొని పడుట.

౩. ఈతకొట్టుచుండగా నీటియందుండు త్రాళ్లు, గుడ్డలు, పాచి మొదలగునవి కాళ్లకుచుట్టుకొనియుండుటచేతకాని, భావులలోనుండుసొరంగములలో తల, కాళ్లు, మొదలగునవిప్రవేశించుటచేతకాని, ముండ్లు, కఱ్ఱలు మొదలగు

నవి దేహమునకు గ్రుచ్చుకొనుటచేత కాని, మొసలిమొదలగు జంతువులచే యీడ్వబడుటచేతగాని మరణము కలుగును.

రక్షకులుగమనించవలసిన ముఖ్యాంశములు.

౧. ధైర్యము, ఓర్పుకలిగియుండవలెను.

౨. తటాకాదులయందేవిధముగపడిన విషయము, ఊహచేతగాని, విచారించుటచేతగానికనుగొనవలెను.

౩. మొదటిగతివలన పడియుండిన రెండు మూడుమార్లుపైకి తేలుటకలదు. అట్టిసమయములో పొడవుగనుండు ఉత్తరీయమునుగాని, త్రాడునుగాని ప్రాణిపైవుగవిసరివేసి, మరియొకకొనను చేతులతో బిగియ పట్టుకొనవలెను. ఆప్రాణివిసరబడిన దానినిపట్టుకొనిన వెంటనేపైకిలాగివేయవలెను. సమీపములోతేలుచున్న పైకినిలచిచేతితో యీడ్వవలెను. ఏమాత్రమైనను నీటిలోప్రవేశించకూడదు. ఏలననీటిలోపడినవారలు భీతిచేరక్షించుటకై దిగినవారిని గట్టిగపట్టుకుందురు. అట్టిసమయములో పట్టుతప్పించుకొనజాలక యిరువురుప్రాణములబోగొట్టుకొందురు.

౪. రెండు, మూడుగంటలుగబడిన వారలు, భారము వహించి యుండుటచేతను, నిర్బంధింపబడి యుండుటచేతను పైకి తేలుటలేదు. అట్టివారిని ఈదుటకువచ్చినవారలు నీటిలో బహుజాగ్రతగా ప్రవేశించి కాళ్లతోగాని, చేతులతోగాని ప్రాణులను వెదకిబయటకి తీసుకొనిరావలెను. (ముసళ్లు, సారంగములు, ముండ్లు, కలభావులలో, దిగుట యందు అత్యంతజాగ్రతయు, యుక్తియు, కలిగియుండవలెను. భావికిపైన త్రాళ్లువ్రేలాడగట్టిదానిసహాయ్యముతోనీటియందుప్రవేశింపవలెను.)

ప్రాణినినీటిలోనుండిబయటతెచ్చిన వెంటనేచేయదగినవిధులు:-

౧. ప్రాణినియిటునటుదూరప్రదేశముకుకొనిపోక, ఆలస్యము చేయక, గట్టునందే వేసిదేహమందుండు బట్టను చింపి పారవేయవలెను.

౨. బొడ్డుభాగములో చేతితో నొక దెబ్బ కొట్టవలెను.

౩. వెంటనేబోర్లపడవేసిముఖముక్రిందచేతినియుంచి, ఘనమైనరాతినిగాని, బట్టలమూటనుగాని, కట్టెనుగాని, కడుపుక్రిందయుంచవలెను.

౪. వీపు యిరుప్రక్కలయందును చేతులతో గట్టిగ అదుమవలెను. పిదప వదులుచేయవలెను మరలఅదుమవలెను. ఇట్లు కొన్ని నిముషములు చేయుటచే కడుపులోను శ్వాసకోశములయందునుండు నీరంతయు క్రిందు వైపుగ నుండునోటిగుండా వెళ్లిపోవును.

### శ్వాసింపచేయుక్రమము.

### (*Artificial respiration.*)

౫. ప్రాణిని వెల్లకిలపరుండజేసి గొంతుక్రింద బట్టలమూటనుంచవలెను.

౬. నోరు తెరచి పండ్లసందులో కాగితముల చుట్టగాని, పెన్సల్ మొదలగు వస్తువులు కాని యుంచవలెను.

౭. రక్షకుడు ప్రాణియొక్క తలక్రిందుగ మోకాళ్ల మీాద నిలువబడితన చేతులతో ప్రాణియొక్క మోచేతులు పట్టుకొని పైనుండి తలక్రిందుగ తీసుకొనిపోవలెను. మరలవెనుకకు అదేమార్గముగ తీసుకొనిపోయి ప్రాణియొక్క ప్రక్కలయందు అదుమవలెను. ఈరీతిగ నిముషమునకు ౧౬ మార్లు చేయవలెను. ఇటుల ఓపికతో ౩, ౪ ఘంటలకాలము జరిపిన ప్రాణికి యథావిధిగ శ్వాసము వచ్చుటకలదు.

౮. కాళ్లు, చేతులు, నిప్పునకాపుచుండవలెను.

౯. ౫, ౬, ౭, ౮, విధులను ఉరిపోసికొని శ్వాసించక యుండువారికిని అపరిశుద్ధవాయువులు పీల్చుటచే శ్వాసించకయుండువారికిని యింకనుయితర శ్వాసప్రతిబంధక సమయములందును ౧, ౨, ఘంటలకాలమైనప్రయోగించి అంతకునుశ్వాసమురాకపోయిన ఆశను వదులుకొనవలెను.

ఉరిపోసుకొనుట.

(*Hanging.*)

ఉరిపోసుకొనినవారలగుపడినవెంటనేక్రిందనుండుకుర్చి మొదలగునవిపారవైచి పైకెత్తాడునునరుకవలెను. పిదప ఉరినివిడతీయవలెను. లేకప్రాణినిపైకెత్తిగొంతులోనుండుఉరిని విడదీయవలెను. శ్వాసమునిలిచిపోయియున్న, శ్వాసప్రతి బంధక చికిత్సలుచేయవలెను.

# అధ్యాయము. XI.

## విషములు (*Poisons.*)

దేహములోప్రవేశించినవెంటనే నొప్పి, బాధ, మంట, పోట్లు,మూర్ఛ మొదలగునవికలుగజేసి ప్రాణము సహాహరింప శక్తికలిగినటువంటి విషములనబడును.

విషభేదములు
- స్థావరవిషములు
- జంగమవిషములు
- కృత్రిమవిషములు

స్థావరవిషములు.

(౧) వత్సనాభిగడ్డ, పొత్తిగడ్డ, మొదలగువాటి వేళ్లు.

(౨) విషముష్టి, ఉమ్మెత్త విత్తులు, జీడిగింజలు, గురిగింజ, నేపాళము, మొదలగు బీజములు.

(౩) జిల్లేడు, బొంతజెముడు, మొదలగు వాటి క్షీరములు.

(౪) పాదరసము, గంధకము, సీసము, తాళకము, మణిశిల, శంకుపాషాణము, మొదలగు ధాతువులు.

జంగమవిషములు.

సర్పము, కుక్కతేలు, ఎలుకలు, కీటకములు, మొదలగువాటిచేకరవబడుట.

కృత్రిమవిషములు.

సర్పాదిజంతువిషములు, విషమూలికలు, లోహములు, మొదలగు వాటిని అన్నములోఁ కలిపి పెట్టుట.

త్రివిధవిషముల సామాన్యలక్షణములు.

| స్థావరవిషము | జంగమవిషము | కృత్రిమవిషము |
|---|---|---|
| జ్వరము | వాపు | ఆలస్యము |

| | | |
|---|---|---|
| వెక్కిళ్లు | తాపము | జడత్వము |
| పండ్లుపులిసియుండుట | నొప్పి | దగ్గు |
| గొంతుపట్టుకొనుట | గగురుపాటు | ఉబ్బసము |
| నోట నురుగు, వాంతి | అతిసారము | బలక్షయము |
| యగుట | బడలిక | రక్తస్రావము |
| అరోచకము | కునికిపాటు | జ్వరము |
| శ్వాస | నిద్ర | శరీరము నందువా |
| మూర్ఛ | అజీర్ణము | పు |
| రక్తస్రావము | నోటిలోనురుగు | నేత్రముల యందు |
| దప్పి | మూర్ఛ | పసుపువర్ణము |

## స్థావరవిషచికిత్సలు.

**వత్సనాభి.**

౧. విషము మ్రింగిన వెంటనే వమనము చేయించి శీతోదకము చల్లవలెను.

౨. చిత్రికూరరసము పిండిచక్కెర కలిపి తాపించవలెను.

3. బొగ్గును చూర్ణము చేసి తాపించవలెను.

**గన్నేరు.**

౧. కలకండచూర్ణము చేసి అందు పెరుగు కలిపి తాపవలెను.

౨. బర్రెపాలలో జిల్లేడుపట్టచూర్ణము కలిపి తాపవలెను.

జీడిగింజలు (తాకుటచేకలిగినశోఫకు)

౧. ఆవాలు, చిత్రమూర, వెన్న, సమభాగము లుదంచిశరీరమునకు లేపనముచేయవలెను.

౨. దేవదారు, ఆవాలు, తుంగముస్తలు, వీటినిచూర్ణముచేసి వెన్నకలిపి లేపనముచేయవలెను.

౩. వెన్న, ఆవుపాలు, కలకండఒకటిగకలిపి లేపనముచేయవలెను.

౪. దూలకొండిరసముగాని, మోదుగుపువ్వురసముగానిపట్టించవలెను.

జీడిగింజల భక్షణచేకలిగినవికారమునకు.

౧. వంకాయవిత్తులుకాని, నేలములకవిత్తులుకాని ఉదకముచే నూరి రసముతీసి ౪ తులములు పానముచేయవలెను

౨. పగిడిపత్తిపూలు, కలకండ, ఉదకముతోనూరి పానముచేయవలెను.

గురిగింజలు.

౧. చిత్రమూరరసములోచక్కెర కలిపితాపవలెను.

౨. తేనె, ఖర్జూరము. (ద్రాక్షపండు, చింతపండు, దాడిమపండు, ఉసిరికకాయల రసము సమముగచేర్చి తాపవలెను.

**నేపాళవిత్తులు.** — ధనియాలు, కలకండ, చక్కెగనూరి కలిపి తాపించవలెను. పెరుగు లేక మజ్జిగ తాపించవలెను.

**విషముష్టి విత్తులు.**
- ౧. నెయ్యి, తేనె, కలకండ, వీటినొకటిగ జేసి భక్షింపవలెను.
- ౨. నేరెడుచెక్క కషాయముగాని, మొగిలిచెక్క కషాయముగాని తాపించవలెను.

**అఫీని.**
- ౧. ప్రాకుడుసమూలముదంచిరసముతీసి తాపించవలెను.
- ౨. వస, సైంధవలవణము, పిప్పిళ్లు, మంగకాయ — ఉష్ణోదకముతో నూరి తాపించవలెను.
- 3 అల్లపుస్వరసము ౨ తులములు తేనెలో కలిపితాపవలెను.

**జముడు జిల్లేడు కల్లి — మొదలగు వాటి పాలు తగిలిన**
- ౧ తంగేడాకురసముపట్టించవలెను.
- ౨. చింతాకునుఉదకముతో నూరిపట్టించవలెను, లేక తాపవలెను.

**పాదరసము**

౧. గోధుమపిండిని చిక్కగా కలిపి త్రాగవలెను.

౨. బూడిద గుమ్మడికాయ రసము, బిల్వపత్రాల రసము మాదీఫలరసము వీటిలో నేదియేని త్రాగించవలెను.

౩. గంధకము ౧ తు॥ తమలపాకులోనుంచి ప్రతిదినము భక్షింపచేయవలెను.

౪. తమలపాకురసము, గుంటగలిజేరురసము, తులసిరసము, మేకపాలు. — ఒకటిగాచేర్చి దేహమునకు పట్టించుకొని స్నానము చేయవలెను.

౫. ద్రాక్షపండు
బూడిదగుమ్మడిబద్దలు
తులసి
సోపు
లవంగములు
నాగకేసరములు
శుద్ధచేసినగంధకము
— ఒక్కొక్కటి ¼ తులము పాలలోకలిపి త్రాగించవలెను.

**గంధకము**
౧. ఆవుపాలలో నెయ్యికలిపి తాపించవలెను.
౨. లవంగములు, వజ ఒక అణాయెత్తు పాలలోకలిపి తాపించవలెను.

**కర్పూరము**
౧. బత్తెపేసరసము, ౧ ఫలము తాపించవలెను.
౨. ధనియాలు, ఖండచక్కెర నూరి తాపించవలెను.

**మైలుతుత్తము** — నిమ్మపండ్ల రసము తాపించవలెను.
**నవాసాగరము** — గాడిదపెంటికల రసము తాపించవలెను.

**తాళకము, మణిశిల**
౧. దాడిమవిత్తులరసము పానము చేయించవలెను.
౨. జీలకఱ్ఱ, చక్కెర సమముగ చేర్చి భక్షింపవలెను.
౩. ప్రాకుడువేళ్లు, నేలవేము సమముగ ఉంచి కషాయము కాచి తాపించవలెను.
౪. సర్పాక్షిరసము, చక్కెర పానము చేయించవలెను.
౫. ఆవుపాలు, తేనె కలిపి తాపించవలెను.

| | | |
|---|---|---|
| లోహములు, స్వర్ణము, వెండి, తామ్రము, సీసము, ఇనుము, మొ॥ | ౧. సైంధవలవణము, తెల్లతెగడ | చూర్ణము ఉష్ణోదకములోకలిపితాపించవలెను. |
| | ౨. కరక్కాయ చూర్ణము, తేనె | కలిపినాకించవలెను. |
| | ౩. గరికరసము<br>తేనె<br>కలకండ | కలిపినాకించవలెను. |
| | ౪. వస<br>కరక్కాయ<br>కలకండ<br>తేనె | చూర్ణముకలిపి నాకించవలెను. |

| | |
|---|---|
| దీపము కట్టెలు లేక అగ్గిపుల్లలు | మైలుతుత్తము. ౨ గురిగింజల ఎత్తు ప్రతి ౫ నిముషములకు వమనమగువరకు నివ్వవలెను.<br>తరువాత విరేచనముఁకివ్వవలెను. |

## జంగమవిషచికిత్సలు.

| జంతువులు. | కాటులక్షణములు. | చికిత్సలు. |
|---|---|---|
| | దీనికాటు ౩ విధములుగానుండును. | చికిత్సక్రమము. |
| సర్పము. | తుండాహతము—కోరలు తగులకదా నిజోల్లు మాత్రము తగిలియుండునది. | ౧. పాము కరచినతోడనే మట్టిగడ్డను పండ్లచేకొఱికి, ఉమ్మివేసి, ఆఉమ్మివేసినమట్టిని కరచినస్థానములో లేపనముచేయవలెను. లేక చెవిలోనిగుబిలిని లేపనము చేయవలెను. |
| | వ్యాలీఢము— ఒకటిరెండు కోరలు తగిలిరక్తము వెడలక యుండునది. | |
| | వ్యాలుప్తము— రెండుకోరలు దృఢముగతగిలి రక్తముతో గూడియుండునది. | ౨. తెల్లపట్టుదారమునుగాని, వెంట్రుకలనుగాని, పాము కరచినచోటికిపైన ౪ అంగుళముల ఎత్తులో కట్టవలెను. |

| జంతువులు. | కాటులక్షణములు. | చికిత్సలు. |
|---|---|---|
| సర్పము. | దష్టకము— కోరలు గట్టిగ తగిలి మాంసము ఛేదింపబడి ధారగా రక్తము కారుచుండునది. | ౩. ఆచోటకత్తిచే గీచి విషరక్తమును బైలుపరుపవలెను. లేకసలాకుచే కాల్పవలెను. |
| | (దీనిలో ౧, ౨, విషరహితములుగ నుండును. ,, ౩, ౪, విషమెక్కువదిగనుండును.) | ౪. లేకకట్టుగట్టిన వెనుక యితరులు మట్టి బూడిదె కాని, గోమయముగాని నోటనిండ నుంచుకొని పాము కరచినచోటులో నొకగొట్టము పెట్టినోటిచే విషమును పీల్చవలెను. |
| | లక్షణములు. ౧. కాటులోపోట్లు, దురద, వాపు, నొప్పి, తాపముఉంటకట్టియుండుట. మొ॥ ౨. శ్యావ వర్ణముగలదుష్టరక్త స్రావము. | ౫. గురిగింజ, పెద్దసర్పాక్షి వేళ్లను నూరి కాటునకు లేపనముచేయవలెను. |

| జంతువులు. | కాటులక్షణములు. | చికిత్సలు. |
| --- | --- | --- |
| | ౩. ముఖము, కండ్లు, నాలుక వీటియొక్క వర్ణభేదము. | ౬. మంజిష్ఠ, కరుధూపము, తేనె, వీటిని నేతిలో కలిపి తాపించవలెను. |
| సర్పము. | ౪. వాంతి, వెక్కిళ్లు, మూర్ఛ, దప్పి చెమట, తాపము, మెడపట్టుకొనుట, నోటిలో బురుగువచ్చుట మొదలగు లక్షణములుండుట. | ౪౧ నుండి ౫౧ వరకు గల యోగములలోనే క్రియఅయినను చేయవచ్చును. |
| తేలు. | లక్షణములు.<br>౧. కుట్టినచోటఅగ్నివలెదహించును.<br>౨ అతిశీఘ్రముగ శరీరమునకెక్కు కర్చినచోట మండుచుండును.<br>౩. కుట్టినచోట నొప్పి, నల్లవర్ణము, సూదులచే పొడచినట్లుగా పోట్లు మొదలగునవి ఉండును.<br>౪. విశేషోపద్రవములు. | ౫౨ నుండి ౬౨ వరకుగల యోగములలో దేనినైనను ఉపయోగించవలెను. |

| జంతువులు. | కాటులక్షణములు. | | చికిత్సలు. |
|---|---|---|---|
| తేలు. | *a* శరీరము మొద్దుబారియుండుట. *b.* బడలిక *d* మూర్ఛ *f.* చక్రమువలెతిరుగుట *c* చమట *e* నోరుఎండుట *g* పొర్లాడుట | | |
| | కుక్క లక్షణములు. | | |
| కుక్క. | జొల్లుకారుచుండుట గ్రుడ్డిగ, చెవుడుగనుండుట, తోక, చెక్కిళ్లు, భుజ శిరస్సులుజారియుండుట, తలవంచుకొని దుఃఖముతోనుండుట, ఎప్పుడు పరుగెత్తుచుండుట. | ఇట్టిలక్షణములు కల పిచ్చికుక్క కరచిన దారుణమైన క్షోభకలుగును. | (౧) కాటునుబాగుగాకాచబడి మిక్కిలివేడిగానుండునేతితో కాల్చవలెను. (౨) కాల్చబడిన కాటునుఛేదించికొంత రక్తము స్రవింప జేసి యో॥ ౬౩ను లేపనముచేయవలెను. (౩) ౬౩ నుండి ౭౨ వరకుగల యోగములలో దేనినైనను ఉపయోగింపవచ్చును. |

| జంతువులు. | కాటులక్షణములు. | చికిత్సలు. |
|---|---|---|
| కుక్క. | కాటుబడినవానిలక్షణములు.<br>౧. నొప్పి<br>౨. జ్వరము<br>౩. భ్రమ<br>౪. శరీరస్తబ్ధము<br>౫. కుక్కవలెకూయుట మొదలగునవి<br><br>కాటులక్షణములు.<br>(౧) స్పర్శజ్ఞానము లేకుండుట.<br>(౨) నల్లని రక్తము స్రవించుట.<br>(౩) దురద, పోట్లు.<br>(౪) వికారవర్ణము<br>(౫) శూల, పాకము, పగుళ్లు, గ్రంథులు, మొదలగునవి ఉండును. | |

| జంతువులు. | కాటులక్షణములు. | చికిత్సలు. |
| --- | --- | --- |
| ఎలుక. | కాటులక్షణములు. వాపు, మండలములు, గ్రంథులు, భ్రమ, అరుచి, శూల, దౌర్బల్యము, వణుకు, గణుపులయందునొప్పి, గగుర్పాటు, స్రావము, మూర్ఛ, మొ॥ | (౧) కాటును కుక్కకాటును చెప్పిన ప్రకారము కాల్చవలెను. (౨) పిదప ౭౩ మొదలు ౭౮ వరకు గల యోగములలో దేనినేని ఉపయోగించవలెను. |
| కీటకములు సాలెపురుగు మొ॥. | పోట్లు, నొప్పి, మంట, కరచినస్థలము లోగుంటగా నుండువాపు, జ్వరము, దురద, అరోచకము. | (౧) విరేచనము చేయించి మట్టిమొదలగు క్షీరవృక్షములపట్టలనునూరి లేపనము చేయవలెను. (౨) ౭౯ మొదలు ౮౧ వరకుగల యోగములలో దేనినేని ఉపయోగించవలెను. |
| తేనెటీగలు, అడవియీగలు, తుమ్మెదలు మొ॥. | ,, ,, ,, | యోగములు ౮౨, ౮౩, ౭౯, ఉపయోగములు. |

| జంతువులు. | కాటులక్షణములు. | చికిత్సలు. |
| --- | --- | --- |
| చెవిలోకీటకములు, జోరీగలు ప్రవేశించుట | మరద, పోటు, నొప్పి మొదలగునవి. | (౧) చిమ్మెనగొట్టముతో యో॥ ౮౪ ప్రయోగించవలెను. (౨) యో॥ ౮౫, ౮౬ ఉపయోగించవలెను. |

# అధ్యాయము. XII.

## వాతరోగములు(*Nervous Diseases*)

కారణము:—శరీరసాత్మ్యము కానివిరుద్ధాహారసేవనచే వాతరోగములు జనించును.

సామాన్యలక్షణములు:—బాధ, పోట్లు, పగులకొట్టినటులవేదన, శరీరసంకోచము, శరీరముచిక్కిపోయిఉండుట, శరీరము మెలిబడుట, కీళ్లునొచ్చుట, అంగములువాచుట, అంగములు బిరుసైనల్లగనుండుట, నిదురగలుగుట, మూర్ఛకలుగుట, నోటిలో బురుగువచ్చుటమొదలగునవి.

# బలవత్తరమైనవాతభేదములు.

| | వాతభేదములు. | వాతలక్షణములు. | రక్షలువేయుస్థలములు. |
|---|---|---|---|
| ౧ | అంతరాయామము. | వాతము రొమ్ము నాశ్రయించి విల్లువలెవంగతీయునది. | శిరము లలాటము, కర్ణమూలము, మెడ వెనుక భాగము, |
| ౨ | బహిరాయామము. | వాతమువీపునాశ్రయించివిల్లువలెవంగతీయునది. | నడివీపు, ముడ్డిప్రాస, రొమ్ము, పిక్కలు. |
| ౩ | దండక వాతము. | శరీరమునుకఱ్ఱవలె స్తంభింపజేయునది. | ఇదిఅసాధ్యముగుటం జేసిరక్షలు వేయజనదు. |
| ౪ | అర్దితవాతము. | వాతముముఖమునాశ్రయించిసగమునోరును వంకరగ జేయునది. | పెడకపై భాగము. |
| ౫ | హనుస్రంసవాతము. | వాతము దవుడల నాశ్రయించి వానినిజారునటుల జేయునది. | చెక్కిళ్లమూలము, లేక పెద్దచెవిగూబ మొదటిగుంట, లేక క్రిందిపెదవిగుంట. |
| ౬ | వ్రణాయామవాతము. | వ్రణప్రకోపము వలన శరీరమునులోనికిగాని వెలుపలికిగానివంగతీయునది. | చికిత్సింపకూడదు. |

| వాతభేదములు. | వాతలక్షణములు. | రక్తులువేయుస్థలములు. |
|---|---|---|
| ౭ జిహ్వాస్తంభవాతము. | వాతమువాగ్వాహినీ సిరలయందుప్రవేశించినాలుకను దండమువలె స్తంభింపజేయునది. | చెవికొలుకులు. |
| ౮ కళాయఖంజవాతము. | శరీరసంధులు వదలించి, శరీరమును, కాళ్లను, వణికింపుచు, ఖంజరీపిట్టవలెవంకరగ నడచునటులం జేయునది | కీళ్లు. |
| ౯ గృధ్రసీవాతము. | ఒకపాదము యొక్క సిరలనాశ్రయించికదలకబంధింప జేయునది | మోకాలు యొక్క నాలుగంగుళములపైనగాని లేక వెనుకగాని. |
| ౧౦ విశ్వాచీవాతము. | ఒకహస్తముయొక్క స్థూలసిరలయందుప్రవేశించి, అందుండి భుజములయందు వ్యాపించి హస్తమునుకదలక బంధింపజేయునది. | చెయ్యినడిమికీలుకు ముందరగాని లేక వెనుకగాని. |

| | వాతభేదములు. | వాతలక్షణములు. | రక్తులువేయుస్థలములు. |
|---|---|---|---|
| ౧౧ | ఖల్లీవాతము | కాళ్లు, చేతులయందువ్యాపించి శూలనుకలుగజేయునది. | మోకాళ్లు, మోచేతులయొక్క ముందరగాని లేక వెనుకగాని. |
| ౧౨ | అపతంత్రకవాతము | వాతముఊర్ధ్వముఖంబై లోపల వెలుపలవేదనను, తాపమును, గలుగంజేయుచుశరీరమునువంగతీయునది. | శిరము, లలాటము, కర్ణమూలము, మెడ, నడివీపు, ముడ్డిపూస, ఱొమ్ము, పిక్కలు. |
| ౧౩ | అపతానకవాతము | | |
| ౧౪ | పంగువాతము | వాతము రెండురొండ్ల ప్రవేశించితొడలయందలిస్థూలనరంబులకేగితొడలబంధింపజేయునది. | తొడలమధ్యమున. |
| ౧౫ | ఖంజవాతము | వాతముఒక రొండియందుప్రవేశించిఒకతొడయందు వ్యాపించికుంటితనము కలుగజేయునది. | ,, ,, |

| | వాతభేదములు. | వాతలక్షణములు. | రక్తులువేయుస్థలములు. |
|---|---|---|---|
| ౧౬ | ఊరుస్తంభవాతము | వాతముతొడలయందుప్రవేశించిగుదియవలెస్తంభింపజేయునది. | తొడలమధ్యమున. |
| ౧౭ | శిరోగ్రహవాతము | మెడ, తల, వీనినికదలకబంధింపజేయునది. | మెడతుదను. |
| ౧౮ | ఆక్షేపకవాతము | వాతముసిరలజొచ్చి ఏనుగుమీదగూర్చుండువానిశరీరము కదలుభంగిశరీరమును పలుమారుకదలునటులజేయునది. | శిరము, లలాటము, కర్ణమూలము, మెడ, నడివీపు, ముడ్డిపూస, ఊరొమ్ము, పిక్కలు. |
| ౧౯ | పాదదాహవాతము | నడచినఅరకాళ్లుమండునటులంజేయునది. | రక్తులువేయకూడదు. |
| ౨౦ | కంటకవాతము | నడచినముండ్లునాటునటులనొప్పికలుగంజేయునది. | చీలమండలమునకు రెండువేళ్లక్రిందుగ. |

| | వాత భేదములు. | వాత లక్షణములు. | రక్తులు వేయుస్థలములు. |
|---|---|---|---|
| ౨౧ | అపబాహుక వాతము | చెయ్యినితలక్రిందుగ జేయునది. | భుజశిరస్సులకు రెండువ్రేళ్లక్రిందుగ. |
| ౨౨ | క్రోష్టుశీర్షక వాతము | మోకాలినడుమకడునొప్పినివాపును కలుగజేయునది. | మోకాలిచిప్ప తిరుగువారయందు. |
| ౨౩ | పాదహర్ష వాతము | వాతముకఫాశ్రితమై కాళ్లయందుమగిలిగింతలవలెతిమురును కలుగజేయునది. | రక్తులు వేయకూడదు. |
| ౨౪ | పక్షఘాత వాతము | వాతముఅర్ధాంగమున ప్రవేశించిసంధిబంధనములవదలించి శరీరముయొక్క ఒక పార్శ్వమును చేతనారహితముగ జేయునది. | ఇరుప్రక్కలు. |
| ౨౫ | సర్వాంగ వాతము | పిరగగొట్టినటుల సర్వాంగములయందునొప్పిని కలుగంజేయునది. | రక్తులు వేయకూడదు. |

## వాతహరచికిత్సలు.

(౧) మొదటవాతలక్షణములు కనుగొని నిర్ణీతమైనస్థలములలో పసుపుకాల్చిగాని గాజునుకాల్చిగాని లేక యినుపసలాకులు కాల్చిగాని రక్షలు వేయవలెను.

(౨) ౮౭, ౮౮ యో॥ లో చెప్పినదినుసులకషాయముగాచి వేడివేడిగ ఒత్తడమిచ్చుటవలన చమటవెడలింపవలయును.

(౩) ౯౧, ౯౨ యోగములలో జెప్పిన తైలము లేపనముచేయవలెను.

(౪) ౮౭, ౮౮, ౮౯, ౯౦, ౯౭, ౯౮, ౯౯, ౧౦౦ యోగములలో దేనినేని పానము చేయించవలెను.

(౫) ౯౩, ౯౪, ౯౫, యో॥ ముక్కులో పిండవలెను.

(౬) ౯౬ యోగము చెవిలో పిండవలెను.

# అధ్యాయము. XIII.

## ప్రసవములు, ప్రసవోపచారములు.

## (*Midwifery and Management of Labor*)

స్త్రీప్రసవము దైవికము. ఏప్రకృతిప్రభావముచే స్త్రీగర్భము ధరించిన పిమ్మట, గర్భస్థశిశువుదినదినాభివృద్ధిని బొందుచుండునో, ఆప్రకృతిప్రభావముచేతనే గర్భమునుండి శిశువు బయలువెడలును. అయినను ప్రసవకాలమందు జరుపుశుశ్రూషల వైపరీత్యముచే శిశువునకును, గర్భమునకును హాని సంభవించుటయే కాక మరణము కూడ కలుగును. కొన్ని సమయములయందు వైద్యులసహాయ్యముగాని, మంత్రసానులసహాయ్యముగాని దొరకకుండునప్పుడు స్త్రీప్రసవము సంభవించుచు. అట్టివేళల గృహస్థులకే ప్రసవవిషయికజ్ఞానము లేకపోయిన మానహానియు, ధనహానియగుటయే కాక, ప్రాణహాని కూడ కలుగవచ్చును. గృహవైద్యసంప్రదాయములను కొంచెమెఱింగియుండిన, ధైర్యము తెచ్చుకొని ప్రసవచికిత్సలు సంపూర్ణముగ నెఱింగినవారొచ్చువరకును, తత్కాలోపశమన చికిత్సలుగాని, ఉపచారములుగాని, చేసి ప్రాణములకాపాడ వచ్చును. కనుక ప్రతిమనుజుడును, స్త్రీయును, ప్రసవచికిత్సలు తెలిసికొనియుండుట త్యావశ్యకము.

### స్త్రీ ప్రసవించునని తెలియజేయు లక్షణములు.

౧. కుక్షిప్రదేశము జారినటులుండుట.

౨. పిరుదులముందు భాగమందు శూలకలుగుట.

3. నడుముయందు పిరుదులయందు, వేదనకలుగుట.

౪. శరీరము ఆయాసము జెందినటులుండుట.

౫. మలమూత్రములు అధికముగాపోవుట.

౬. తెలుపువిశేషము కారుచుండుట, మొదలైనవి.

స్త్రీప్రసవము మూడుభాగములు.
- ౧. యోనిద్వారము తెరువబడుట.
- ౨. శిశువుబయలు వెడలుట.
- 3. మావిబయటపడుట.

ప్రథమావస్థ--దీనియందు యోనిసంబంధమైన కండరములు సంకోచము జెందిముందరనుండు ద్రవపూరితమైన తిత్తి నిలణ చుటచే యోనిద్వారము తెరువబడును. ఈసమయమందే నిజమైనశూలలు వీపునుండి పొత్తికడుపు ప్రక్కగా క్షణక్షణము కలుగును. కొన్నివేళల అసహనమగు శూలలచే స్త్రీ కడు రోదనము చేయును.

ద్వితీయావస్థ——శిశువును ఆవరించియుండు పొరలూడుటచే యోనిద్వారము వికాసము జెంది, అధికముగానుండిన నొప్పులు

కొంతఉపశమించును. ఈసమయములోనే స్త్రీ ఊపిరిబిగియ బట్టిముక్కును. గర్భస్థశిశువు గర్భాశయమువిడచి యొకింత బయలు వెడలినయెడల ధృఢముగాముక్కును. శిశువుయోనిముఖమును జెందినయెడల అతిధృఢముగముక్కును. వెంటనేశిశువునుఆవరించిన ద్రవపూరితమైన కళపగిలి స్రవించును. ఒకక్షణముతరువాత వెను వెంట కఠినమైనశూలలుజనించి తల వెలుపలకివచ్చును. సాధారణముగ గర్భమునుండి వెడలివచ్చు శిశువుచేతులుముడుచుకొని, గడ్డముముందరికిబెట్టి, కాళ్లు పైకి కడుపువైపుపెట్టుకొనియుండును.

తృతీయావస్థ—శిశువు బయలు వెడలిన పిమ్మట మావి (*Placenta*) పడును. ఈమావిప్రసవించినతోడనే మరలశూలలు జనించి వెంటనే పడుటకలదు. లేక ౫నుండి ౧౦ నిమిషములలో నెప్పుడైనను పడుటకలదు.

ఈపైమూడు అవస్థలు యింతకాలములోపలకలుగునని చెప్పుటకువీలుపడదు. కొందరు ౫ నిమిషములలో ప్రసవింతురు. కొందరు ౨, ౩, దినములలోప్రసవింతురు. అయిన ప్రథమావస్థయే అధికకాలముపట్టును.

## ప్రసవసమయముందుసిద్ధపరుపవలసిన వస్తువులు.

౧. చక్కగ అలికిసున్నము పూసి నట్టిన్ని, తూర్పు లేక దక్షిణద్వారముతో కూడియుండుగది.
౨. పట్టు లేక తాళ్లతో అల్లిన మంచము
౩ పరుపు
౪. దిండ్లు
౫. కంబళి
౬. దుప్పట్లు
౭. పాతచీరలు
౮. నాలుగుమూరలమైనపుగుడ్డ
౯. చాప
౧౦. ఒకకూజాలో చల్ల నీళ్లు. మరియొకదానిలో వేడినీళ్లు
౧౧. మలమూత్ర విసర్జనపళ్లెరము
౧౨. తువాళ్లు
౧౩. సబ్బు
౧౪. చిట్టాముదము
౧౫. కస్తూరి
౧౬. గోరోజనము
౧౭ నెయ్యి
౧౮. సైంధవలవణము
౧౯. ప్రత్తి
౨౦. కర్పూరము
౨౧. దీపము
౨౨. అగ్గిపెట్టె
౨౩. సన్నకుండ
౨౪. బొగ్గులు, పొయ్యి
౨౫. అసనపిచకారీ
౨౬. కత్తెర
౨౭. చాకు
౨౮. నూలు లేక పట్టుదారము
౨౯. ఘుడియారము
౩౦ నడికట్టు
౩౧. వక్కలు, ఆకులు, సున్నము, లవంగాలు మొ॥
౩౨. నవాసాగరము

స్త్రీకి ప్రసవ చిహ్నములగుపడిన వెంటనే—స్త్రీని ప్రసవగృహము చేర్చవలెను. మలమూత్రాదులకవసరముండిన ఆగదియందే కావింపవలెను. మలమూత్రాదులు కావించునప్పుడు ముక్కకూడదు. కానుపుచేయడములో అనుభవముగల ఒకరినికాని, యిద్దరినికాని ఆగదియందుంచవలెను. ఒరులెవ్వరిని రానివ్వగూడదు. స్త్రీకి ధైర్యమునిచ్చు మాటలుకాని, కథలుకాని చెప్పుచుండవలెను. ప్రథమావస్థదీర్ఘముగనుండిన స్త్రీయిటునటు తిరుగవచ్చును. లేకున్న చిట్టిచాపమీదనైనపుబట్టపరచి దిండుకుగాని గోడకుగాని ఆనుకొని కూర్చుండజేయవలెను.

ద్వితీయావస్థ చిహ్నములగుపడిన వెంటనే—స్త్రీ యొక్క తొడలు నొకింతముడుచునటుల జేసి వెల్లకిలపరుండ జేయవలెను. లేక, వెనుప్రక్కను ఎవరిమీదనైనను ఆనుకొనజేసి కాళ్లనుగోడకుమీటి కూర్చుండ జేయవచ్చును. లేక చేతులనుభూమి మీద ఆనుకొనజేసి, కాళ్లను తొడలవైపుగముడుచుకొని కూర్చుండజేయవచ్చును.

కానుపుచేయువారలు స్త్రీగర్భమునకెదురుగా కూర్చుండి చేతులను సబ్బుతోకడుగుకొని ఆముదముపూసికొని, శిశువు వెడలుటనునిరీక్షించుచుండవలెను. ఘడియారమునుచూచు చుండవలెను. ఒకటిరెండు శూలలు జనించినంతనే శిశువును ఆవరించియుండుతిత్తిపగిలి అచ్చటనుండి నీరుస్రవించును. కొం దరికినీరు పావుశేరునుండి ౧, ౨, శేర్లవరకు స్రవించును. కొం దరికిబిందెడుస్రవించుటయుకలదు. వెంటనేశిశువుతల వెలు పలికివచ్చును. దేహమంతయు అప్పుడేవచ్చుటకలదు. ఒ కవేళ రాకున్న కానుపుచేయువారలు శిశువుచంకలకు ప్రేళ్లువేసి లాగివేయవచ్చును. నాభినాళముగొంతుకు చుట్టుకొనియుండిన వెంటనే ప్రేళ్లతో శిశువుతలమీదుగ తప్పించవలెను. పుట్టి నతక్షణముఘడియారమును చూచి,సరియైన కాలమును జ్ఞాపక ముంచుకొనవలెను. శిశువుజనించినతోడనే ఏడ్చును అటు ౧, ౨, నిమిషములలో నేడ్వకపోయినట్లైనదాని ముఖము నందుండుమలినమునుతీసివేసి సైంధవలవణమును నేతిలోకలి పి శిశువుయొక్క నోటిలో రుద్దుటచే కంఠమందుండు కఫము తొలగును. నేతియందు కర్పూరము నానబెట్టి దానిలోప్రత్తిని వడిపి శిశువుయొక్క శిరమందుంచవలెను.

## నాభినాళము ఛేదించువిధము.

నాభినాళమును మాసిపడువరకును ఛేదించకూడదు. నాభినుండి ౮ అంగుళములుచక్కగ పట్టుకొని దానిపైనదారమును గట్టవలెను. తరువాతపదునుగా నుండుచాకుతో దారము కట్టిన భాగమునకుఒక అంగుళముపైగా ఛేదించి, మిగిలిన భాగము దేహమునుండితొలగించికుండలో వేయవలెను.

## శిశువునకుఉపచారములు.

శిశువుదేహమునకంతయు ఆముదముపూసి, మజ్జి, రావిపట్టలు, కచూరాలు, వెలగాకు, బంగారు యీవస్తువులు వేసి కాచబడిననీళ్లతో స్నానము చేయించి, పెసలపిండితో జిడ్డునంతయుకడుగవలెను. ప్రసవించినదిన మంతయుశిశువుపడ్చినప్పుడంతయు ఒకమిల్లి ఆముదమును త్రాపుచుండవలెను. మరునాడు ఒకతూరి ఆముదముమరియొకతూరిదాదిపాలుగాని, నీళ్లుకలిసిన ఆవుపాలు గానిపోయు చుండవలెను. ఇటులనే పురుడు ౧౦ దినములు జరుపుచుండవలెను.

## స్తన్యదుగ్ధము.

శ్లో॥ ధమనీనాం హృదిస్థానాం వివృతత్వాదనన్తరం।
చతూరాత్రాత్త్రిరాత్రాద్వాస్త్రీణాంస్తన్యం
ప్రవర్తతే॥ శు॥ శా॥ ౧౦ అ॥

ప్రసవించినస్త్రీయొక్క ధమనీ ముఖములు వికసించి ౩, ౪, ౫ దినములకు పిదపస్తనములయందు పాలునుకలుగజేయును. కావునతల్లికిపాలుపడువరకును దాసియొక్కపాలుగాని లేకశుద్ధమైన ఆవుపాలలోఉష్ణోదకముఅర్ధభాగముకలిపిగాని ఒకమిల్లెడు ఏడ్చినపుడెల్లను యిచ్చుచుండవలెను. పురిటింటిలోనున్నప్పుడు ఒక తూరికాచిన చిట్టాముదమును వేరొకతూరిపాలనుయిచ్చుచు తలకు, దేహమునకు, ఆముదము రాచుచుండవలెను.

## సూతికోపచారములు.

శిశూపచారములీవిధముగ జరుగుచుండగ స్త్రీకిప్రసవించినతోడనే క్రిందికడుపు రెండు ప్రక్కలలో చేతులువేసి మెల్లమెల్లగకదలించవలెను. ఇటుకదలించుటచే మావిశీఘ్రముగపడిపోవును. మావి ౧౫ నిమిషములలోపడక యుండిన యో॥ ౧౧౧ నుండి ౧౧౫ లో నేదియేని చేయవలెను. మావిపడిన వెంటనే మైలపుగుడ్డమొదలగు మలినము తగిలినవస్తువులను తీసివేసి స్థలమును శుభ్రపరచవలెను.

మావినిపై నాభిభాగము వేసినకుండలో వేసిదూరముగా భూమిలో పూడ్చి వేయవలెను. వెంటనే ౪ అంగుళముల వెడల్పును, ౯ మూరల పొడవునుకలనవారును గాని, బట్టను గాని, నాభిక్రిందు భాగమునుండికడుపువరకుఘట్టిగాబిగియకట్టవలెను. యోనిభాగమున శుభ్రమైన బట్టలుంచిచీరకట్టిమంచముపై పరుండజేయవలెను. చెవులలో వెల్లుల్లిపాయను చితికిపెట్టి తలకుదళమైన బట్టనుకట్టవలెను. తరువాత కస్తూరివేసిన తాంబూలమును పుక్కిటయుంచి కంబళులు, శాలువలు, కప్పి సుఖముగ పరుండజేయవలెను. ఆగదియందువేపచెక్కల ధూపమునుసాంబ్రాణిధూపమునుఉదయము, సాయంకాలము వేయుచుండవలెను.

ప్రసవదినమందు ఆహారము నివ్వకూడదు. మరునాడు మిరియాలచారు, అన్నము, మాత్రము నివ్వవలెను. ఉష్ణోదకమే త్రాగుచుండవలెను. మలమూత్రాదులాగదియందే కావింపవలెను. ప్రతిదినమునుయోనియందుంచిన గుడ్డలనుపారవైచి వేరువస్త్రములను ధరించుచుండవలెను. స్త్రీప్రసవించిన పది దినములకు పిదప స్నానముచేయించి నామకరణాదులు సలుపవలెను. దేహారోగ్యతకు యో॥ ౧౦౮ కాని ౧౦౯ కాని సేవించవచ్చును.

## కష్టప్రసవములు.

పైనవివరించినక్రమములన్నియు సుఖ ప్రసవమందు మాత్రముజరుపదగినవి. పీడలేవియేని కలుగునెడ ప్రసవ కాల ద్వితీయావస్థయందే కలుగును. స్త్రీకి ప్రసవవేదనలగు పడిన 3, 4, ఘంటలలో ప్రసవించకయుండిన యో॥ ౧౧౦ మొదలు ౧౧3 లోగల క్రియలనేదియేనిచేయవలెను.

ప్రసవించు స్త్రీలకు మూఢగర్భమనియు, యోనిసంవరణమనియు, మక్కల్లకమనియు, మూడుప్రాణాపాయ దుస్థితులుకలుగును.

యోనిద్వారము శిశువుయొక్క హస్తపాదముల చేతగాని, భుజశిరస్సుచేతగాని అడ్డగింపబడిన మూఢగర్భమనబడును.

యోనిద్వారము సంకోచింపబడి, శిశువువచ్చు సమయములో తెరువబడకయుండిన, యోనిసంవరణమనబడును.

ప్రసవించినవెంటనే, స్త్రీలకు గర్భమునుండి మలినరక్తముచక్కగా వెడలకపోయిన, నాభికి క్రిందుగా గాని, యిరుప్రక్కలయందుగాని మూత్రకోశమందుగాని, గ్రంథులుజనించును. దీనికి మక్కల్లకమని పేరు.

సూతికారోగము—ఈవ్యాధియందీలక్షణములుండును.

దేహముచల్లగానుండుట, జ్వరము, శరీరమువణకుట, దప్పి, దేహముమొద్దుబారియుండుట, వాపు, గర్భమందుశూల, దగ్గు, అతిసారము, దిగ్భ్రమము, చెమట విశేషముగా వెడలుట, అన్న ద్వేషము మొదలైనవి. ఈపైనాల్గును కేవలవాత ప్రకోపముచేత నేకలుగును.

చికిత్సలు:—

మూఢగర్భము, యోనిసంవరణము, యీ రెండును, శస్త్ర చికిత్సయందతి కుశలులైన వైద్యులచేత నేచికిత్సింపవలయును.

మక్కల్లకమందు, యో॥ ౧౧౪, ౧౧౫, ౧౦౮ యివ్వ వచ్చును.

సూతికారోగమందు యో॥ ౧౦౬, ౧౦౭, ౧౦౮, ౧౦౯, యివ్వవలెను.

ఇతిశ్రీమద్గురువరకరుణాకటాక్ష వీక్షణాసాదితార్ష వైద్యవిద్యానవద్య, శ్రీమద్ధోసూరుశుభ్రవేటివంశపయః పారావార రాకాసుధాకర, శేషగిరిరాయపుత్రరత్న, కవిరత్న, భిషగాచార్యేత్యాది బిరుదావళీ విరాజమాన, విబుధజన విధేయ, హోసూరుసుబ్బరాయప్రణేతంబైన, హిందూగృహవైద్యమను

గ్రంథము,

సమాప్తము.

శ్రీసద్గురుచరణారవిందార్పణమస్తు.



## అనుబంధము (*Appendix*)

# చికిత్సా యోగములు (*Recipes*)

### వ్రణ చికిత్సలు.

| | |
|---|---|
| ౧. మఱ్ఱి<br>మేడి<br>రావి<br>జువ్వి | వీటిపట్టలను చక్కగనూరి గంధముతీసి ఆవు నేతిని చేర్చి పట్టువేయవలెను.<br>వ్రణశోఫహర ద్రవ్యములు (వాపుగల వ్రణముల పండించునవి.) |
| ౨. గుగ్గిలము<br>అగసిఆకు<br>హరిదళము<br>పావురపిట్ట<br>మలము<br>సోడాపుడి | నీటితోనూరి పట్టువేయవలెను.<br>శోఫవిదారణద్రవ్యములు (పండినవాపును పగులగొట్టునవి) |
| ౩. సెనగలు<br>గోధుమలు<br>బార్లిబియ్యం<br>ఉద్దులు<br>పెసలు | వీటినినూరి ముద్దచేసి వ్రణమునకు బంధించవలెను.<br>ఇవి వ్రణపీడన ద్రవ్యములనబడును. |

౪. రాళ్ళాది లేపనము.

| | |
|---|---|
| గుగ్గిలము, మైనము<br>బెల్లము, నెయ్యి | వీటిని కాచి పగిలిన వ్రణములకు లేపనము చేయవలెను. |

౫. పటోలాది కషాయము.

చేతిపొట్లాకు
వేపాకు
} వీటికషాయము వ్రణములు కడుగుటయందు ప్రయోగించును.

౬. పెన్నేరుగడ్డ
తిప్పతీగె
లొద్దుగుచెక్క
అతిమధురము
మంజిష్ఠ
ఆరెపూలు
} వీటికల్కముగాని, పొడులనుగాని లేపనము చేయవలెను.
వ్రణరోపణ ద్రవ్యములు [పగిలిన వ్రణముల నుమాన్పునవి.]

౭. తిలకల్కలేపనము.

నువ్వులకల్కము
వేపాకుకల్కము
తేనె
ఆవునెయ్యి
} కలిపి లేపనము చేయవలెను.

హస్తిదంత లేపనము.

౮. ఏనుగదంతము ఉదకములోనూరి పట్టువేసిన వ్రణములు పండి పగులును.

౯. ఆకుజెముడుపట్టను పాలతోనూరి లేపనముచేసిన పగిలిన వ్రణముమానును.

౧౦. తెల్లవెంపలిచూర్ణము
తేనె
} కలిపి లేపనముచేసిన వ్రణము మానును.

౧౧. కప్పచిప్పసున్నము
ఆరెపువ్వు
లొద్దుగ
} చూర్ణము లేపనము చేయవలెను.

౧౨. వెల్లుల్లిపాయనునూరి లేపనముచేసిన క్రిములునశించును.

౧౩. లాక్షాదిలేపనము.

లక్క
మణిశిల
మంజిష్ఠ
హరిదళము
పసపు
మ్రానిపసపు
ఆవునెయ్యి
తేనె
} చెక్కగనూరి నెయ్యి, తేనె, కలిపి లేపనము చేయవలెను.

౧౪. రసము ½ తు॥
గంధకము ½ ,,
మురదారుసింగు 1 తు॥
గుగ్గిలము 2 ,,
మైలుతుత్తము ¼ ,,
నెయ్యి 4 ,,
} కాటుకవలెనూరి నెయ్యికలిపి పత్తినితడిపివ్రణముపైనుంచి కట్టుకట్టవలెను.

౧౫. తెల్లపట్టువస్త్రము
యొక్కమసి, తేనె
నెయ్యి
} వీటినికలిపి లేపనముచేయవలెను.

## ౧౬. స్తంభనక్రియ.

రక్తచందనము, మినుములు
అతిమధురము, కావిరాయి
చిల్లపెంకు, అంజనము (కాటుకె) పట్టువస్త్రములమసి
క్షీరవృక్షములయొక్క పట్టలు, చిగుళ్లు.
} వీటిలోదొరకినవాటిని రక్తము కారుచుండు వ్రణస్థానములో మూయవలెను.

## అగ్నిదగ్ధ చికిత్సలు.

౧౭. కరక్కాయ, బురద
జీలకఱ్ఱ, అతిమధురము
మైనము, గుగ్గిలము
} వీటినినూరి లేపనము జేయవలెను

౧౮. సుధాది లేపనము.

పాతసున్నము
పెరుగుమీది తేట
} నూరిలేపనము చేయవలెను.

౧౯. దగ్ధయవ చూర్ణము.

బార్లిబియ్యమునుకాల్చిన
మసి, నువ్వులనూనె
} కలిపి లేపనముచేయవలెను.

౨౦. పటోలాది తైలము.

| | |
|---|---|
| చేతిపాళ్ళకల్కము<br>తెల్లావనూనె | కలిపి లేపనము చేయవలెను. |

౨౧. మధూచ్ఛిష్టాది తైలము.

| | |
|---|---|
| మైనము, అతిమధురము<br>లొద్దుగ, గుగ్గిలము<br>గరిక, చందనము, మంజిష్ఠ | వీటికల్కములో నెయ్యిగలిపి చిక్కగ లేపనము చేయవలెను. |

౨౨. రక్తస్రావ చికిత్సలు.

| | |
|---|---|
| లేతదంటురసము ౧ ఫలము. | గాయములయందు రక్తము కారుచున్నదానికీరసము పూయవలెను. |

| | |
|---|---|
| ౨౩. పుష్పకాసీస రసము | గాయమునకు నీరసము పట్టించిన రక్తస్రావము నిలుచును. |

౨౪. గరికె ... డిటో ...

| | |
|---|---|
| ౨౫. మోదుగపట్ట ౪ ఫలములు<br>నీళ్లు ౧౬ ,,<br>సక్కెర ౧ ,, | కషాయముకాచి తాపించవలెను. |

| | |
|---|---|
| ౨౬. అడ్డసరపు చెక్కలేక<br>వేళ్లు ౨ ఫలములు<br>నీళ్లు ౧౬ ,,<br>సక్కెర ౧ ,, | కషాయముకాచి తాపించవలెను. |

౨౭. గుజ్జుపు లద్ది రసము-౨ ఫలములు తాపించవలెను.

౨౮. చెఱకుతునకలు
తేనె
ద్రాక్ష
తామరపువ్వులకల్కము.

చెఱకుతునకలు క్రొత్తకుండలో నానబెట్టి నీళ్లుపోసి రాత్రి బయలులోనుంచి కాచి మిగిలిన సరకులువేసి పానము చేయించవలెను.

౨౯. తెల్లతెగడ ౧ ఫలము
త్రిఫలములు౧ ,,
నల్లతెగడ ౧ ,,
పిప్పిళ్లు —¼ ,,
పంచదార-౧ ,,
నీళ్లు —౧౬ ,,

కషాయముకాచి తాపించిన భేది అగును. (౪ ఫలములకషాయమగువరకు కాచవలెను. మోతాదు 3 ఫలములు.)

౩౦ చందనము
తామరపువ్వు
వట్టివేరు
వేయించిన మట్టిగడ్డ

ఒక్కొకటి ౧ ఫలము ప్రకారము ఉదకములోవేసి కలియబెట్టి దాని తేటలో శర్కర, తేనె కలిపి తాపించవలెను,

౩౧ మంగపండ్ల చూర్ణము ౧ ఫలము
సక్కెర ½ ,,
తేనె ½ ,,

కలిపి తాపించినవమనమగును.

| | | | |
|---|---|---|---|
| ౩౨. బూరుగబంక | ౧ | తులము | కాచితాపించవలెను. |
| మఱ్ఱియూడల చిగుళ్లు | ౧ | ,, | |
| వట్టివేరు | ౨ | ,, | |
| నల్లకలువగడ్డ | ౧ | ,, | |
| పాలు | ౧౬ | ,, | |

| | | | |
|---|---|---|---|
| ౩౩. అడ్డసరపాకు చూర్ణము | ౨ | తు॥ | కషాయము కాచితాపవలెను |
| నీళ్లు | ౧౬ | ,, | |
| అడ్డసరపువ్వులకల్కము | ౧ | ,, | |

| | | | |
|---|---|---|---|
| ౩౪. పావురపిట్ట మలము | $\frac{1}{4}$ | తు॥ | కలిపి నాకించవలెను. |
| తేనె | $\frac{1}{4}$ | ,, | |

| | | | |
|---|---|---|---|
| ౩౫. నల్లకలువతూండ్లక్షారము | $\frac{1}{4}$ | తు॥ | కలిపి నాకించవలెను. |
| తేనె | $\frac{1}{4}$ | ,, | |
| నెయ్యి | $\frac{1}{4}$ | ,, | |

| | | | |
|---|---|---|---|
| ౩౬. పల్లేరుకాయలు | ౧ | ఫ॥ | కాచితాపించపలెను. |
| పిల్లిపీచర | ౧ | ,, | |
| ఆవుపాలు | ౪ | ,, | |

| | | | |
|---|---|---|---|
| ౩౭. పిల్లపెసర వేళ్లు | ౧ | ఫలము | కాచి తాపించవలెను. |
| కారుమినుములవేళ్లు | ౧ | ,, | |
| ఆవుపాలు | ౪ | ,, | |

౩౮. దానిమ్మపువ్వులరసము ౧ తు॥ ముక్కులో పిండవలెను.

| | | | |
|---|---|---|---|
| ౩౯. | నెయ్యి | ౧ తు॥ | రెండునున్నగనూరి కలిపిశిరము నకు లేపనము చేయవలెను. |
| | ఉసిరికవరుగు | ౧ ,, | |

## సర్పదష్ట చికిత్సలు.

| | | | |
|---|---|---|---|
| ౪౦. | గ్రంధి తగరము | ౨ ఫలములు | ఒకటిగజేర్చి పానము చేయించవలెను. |
| | చెంగల్వకోష్టు | ౨ ,, | |
| | ఆవునెయ్యి | ౪ ,, | |
| | తేనె | ౪ ,, | |

| | | | |
|---|---|---|---|
| ౪౧. | తెల్లజిల్లేడువేరు | $\frac{1}{2}$ తు॥ | చూర్ణము మేకపంచితములో కలిపి త్రాపించవలెను. |
| | కొండిసెపాల | ,, ,, | |
| | చేటిబీర | ,, ,, | |
| | ఇంగువ(అరగురిగింజ) | | |
| | వస | $\frac{1}{4}$ ,, | |
| | త్రికటుకములు | $\frac{1}{2}$ ,, | |

౪౨. పుత్రజీవి రసము ౧ ఫలము త్రాపించవలెను.

| | | |
|---|---|---|
| ౪౩. | నేలతాటిగడ్డ రసము ౧ ఫలము | కలిపి త్రాపవలెను. |
| | వెలిగారము ౮ గురిగింజలు | |

౪౪. నేలగుమ్మడువేరు గంధమును భక్షింపజేయవలెను.

౪౫. భూతాంకుశవేరు గంధములో మూడునూనెబొట్లు కలిపి భక్షింపజేయవలెను.

౪౬. చిత్తిరివేళ్ల రసముగాని, గాడిదగడపాకు రసముగాని, ఆ నాశగిరుడగడ్డ రసముగాని పానముచేయించవలెను.

౪౭ ఉత్తరేణి విత్తనముల కషాయముగాని, ఈశ్వరవేరు కషాయముగాని పానము జేయవలెను.

౪౮. కస్తూరిబెండచెట్టును చూర్ణించి సారాయిలో కలిపి పానము చేయించవలెను.

౪౯. ఆవుపాలలో పచ్చిపసపు కషాయముగాచి త్రాపించవలెను.

౫౦. ఇంగువ ౨ భాగములు } జిల్లేడుపాలలో రాచి గాయమునకు లేపనముచేయవలెను.
వెలిగారము ౧ ,,

౫౧. గుంటుమల్లెవేరు } గంధముతీసి గాయమునకు లేపనము చేయవలెను.
పజ

వృశ్చికదష్ట చికిత్సలు.

౫౨. జీలకర్ర } కాగుచున్న నేతిలోవేసి ఒత్తడమివ్వవలెను.
సైంధవలవణము

౫౩. తులసిపువ్వులు } వీటిని కల్కముచేసి కాగుచున్న నేతిలోనూరి లేపనముచేయవలెను.
మాధీఫలరసము
గోమూత్రము

౫౪. పావురపిట్ట మలము } వీటిని మాధీఫలరసముతో నూరి లేపనము చేయవలెను.
కరక్కాయలు
గ్రంధితగరము
శొంఠి

౫౫. పాచి, ఒంటెపల్లు, లేక సైంధవలవణముగాని చాదిలేపనము చేయవలెను.

౫౬. ఇంగువ, హరిదళము, వీటిని చాదిలేపనముచేయవలెను.

౫౭. ఇంగువ, జిల్లేడిపాలు, నూరి లేపనము చేయవలెను.

౫౮. వెలమసంధివేరు గంధముతీసి లేపనముచేయవలెను.

౫౯. గుంటగల్జేరు ఆకులనుపిండి ఆరసమును గాయమునకుచుట్టును లేపనముచేసి ఆపిప్పిని కట్టవలెను.

౬౦. తగరిశెచెట్టు ఆకులరసము లేపనముచేయవలెను.

౬౧. చింతగింజలోనిపప్పును గంధముతీసి కాటుకు లేపనము చేయవలెను.

౬౨. వెంపలిరసము
చిత్రికూరరసము
కలకండ
} వీటి నేకముచేసి పానముచేయవలెను.

కుక్కకాటు చికిత్సలు.

౬౩. దిరిశెనవిత్తులు
పసుపు
గ్రంథితగరము
కుంకుమపువ్వు
తిప్పతీగె
} వీటిని ఉదకములోనూరి తేనెకలిపి లేపనముచేయవలెను.

౬౪. ఊడుగవేళ్ల కషాయము ౩ ఫ॥
ఆవునెయ్యి ౧ ,,
} మిశ్రముచేసి పానము చేయవలెను.

౬౫. వేయించిన నువ్వులచూర్ణము
తెల్లజిల్లేడుపాలు
పాతబెల్లము
} సమముగ మిశ్రముచేసి పానము చేయవలెను

౬౬. పాతాళగరుడగడ్డ చూర్ణము ౧ ఫలము పాలలోకలిపి తాపించవలెను.

౬౭. ఉత్తరేణివిత్తులు ¼ తు॥ తేనెలోకలిపి భక్షించవలెను.

౬౮. వేపవిత్తులు
కొడిశవిత్తులు
చందనము
తామరగడ్డలు
} పాలతోనూరి తాగవలెను.

౬౯. నెయ్యి
కలబందరసము
} ఒకటిగచేర్చి కాచి సైంధవలవణము కలిపిపానము చేయించిన భేదియగును.

౭౦ నల్లఉమ్మెత్తవిత్తులచూర్ణము
తెల్లగలిజేరువేరు ,,
} తేనెలోకలిపి కాటుకు లేపనము చేయవలెను.

౭౧. కరచినస్థలములో కోడిమలము లేపనము చేయవలెను.

౭౨. కాకరాకు రసమును బూసికొని స్నానముచేయవలెను.

## ఎలుకకాటు చికిత్సలు.

| | |
|---|---|
| ౨౩. కరుధూపము<br>మంజిష్ట<br>పసపు<br>సైంధవలవణము | సమభాగములునూరి లేపనము చేయవలెను. |

౨౪. ఊడుగువేళ్లను గొఱ్ఱెమూత్రముతో నూరి లేపనము చేయవలెను.

| | | | |
|---|---|---|---|
| ౨౫. వెలగపండు రసము | ౧ | ఫ॥ | కలిపిపానముచేయించవలెను. |
| ఆవుపేడ ,, | ౧ | ,, | |
| తేనె | ½ | ,, | |

| | | | |
|---|---|---|---|
| ౨౬. తెల్లవెంపలివిత్తులు | ౧ | తు॥ | కలిపిపానముచేయించవలెను. |
| ఆవుమజ్జిగ | ౧ | ఫ॥ | |

| | | | |
|---|---|---|---|
| ౨౭. చింతగింజలచూర్ణము | ½ | తు॥ | పాతనేతిలోకలిపి నాకించవలెను |
| కరుధూపము | $\frac{1}{16}$ | ,, | |

| | |
|---|---|
| ౨౮. సొంఠి, పిప్పిలి<br>మిరియాలు<br>ఆవుపేడరసము | చక్కగానూరి కంటికంజనమువేయవలెను. |

## కీటకదష్ట చికిత్సలు.

| | |
|---|---|
| ౨౯. మనుజుని వెంట్రుకలు<br>ఎఱ్ఱావాలు<br>పాతబెల్లము | వీటినిచేర్చి ధూపమువేయవలెను. |

౮౦. ముత్తెములనుచాది లేపనముచేయవలెను.

౮౧ చిట్టికూరరసము ౧ ఫ॥
తెగడచూర్ణము ,, ,,
ఆవునెయ్యి ,, ,,
} కలిపిపానముచేయించవలెను.

౮౨. బఱ్ఱెవెన్న
వెలిగారము
} వీటనిసమముగాకలిపి లేపనముచేయవలెను.

౮౩. వస, యింగువ
వాయువిడంగములు
సైంధవలవణము
ఏనుగ పిప్పిళ్లు
చిరుబొద్ది, అతివిష
శొంఠి, పిప్పిలి,
మిరియాలు
} సమభాగములునూరి ౧ ఫలము ఉదకముతో పానముచేయవలెను.

౮౪. ఉప్పునీళ్లనుకలిపి చెవిలోవేసి వంచవలెను.

౮౫. గోమూత్రము
మంచినూనె
} ఒకటిగచేర్చి కాచి ఉష్ణముగా చెవిలోవేయవలెను.

౮౬. సొరవిత్తులనునూనెలోనూరి చెవిలోవేయవలెను.

## వాత హరచికిత్సలు.

### సహచరాది కషాయము.

౮౭. పచ్చములుగోరింటవేరు
దేవదారు, శొంఠి
} సమభాగములు ఉదకములో వైచి కాచి ౨, ౩ ఫలములు పానముచేయించవలెను.

## షట్చరణ యోగము.

౮౮. మ్రానిపసపు
కోడిశెవిత్తులు
కటుకరోహిణి
అతివిష
చిత్రమూలము
చిరుబొద్ది
} చూర్ణముచేసి గోమూత్రములోకలిపి పానముచేయించవలెను.

## సౌవర్చలాది ఘృతము.

౮౯. సౌవర్చలవణము
కరక్కాయలు
శొంఠి, పిప్పిలి
మిరియాలు
} సమభాగములు చూర్ణముచేసి ఆవునేతిలోకలిపి భక్షింపజేయవలెను.

౯౦. చవ్యము
కరక్కాయలు
చిత్రమూలము
దేవదారు
} సమభాగములునూరి కల్కముచేసి తేనెలోకలిపి నాకించవలెను.

## మాష తైలము.

౯౧. మినుములు ౮ ఫ॥
నీళ్లు ౬౪ ,,
} ఈ రెండును ౧౬ ఫలములు మిగులునటుల కషాయముకాచియీ క్రిందిదినుసులువేసి నీళ్లుయిగురువరకు కాచవలెను

| | | |
|---|---|---|
| పాలకూరసమూలము ౧ ఫ॥<br>పిన్నసదాపవిత్తులు ౧ ,,<br>శొంఠి, పిప్పిలి, మిరియాలు ,, ,,<br>దుంపరాస్నము ,, ,,<br>అతిమధురము ,, ,,<br>సైంధవలవణము ,, ,,<br>దూలగొండివిత్తులు ,, ,,<br>పాలు ౩౨ ,,<br>నూనె ౮ ,, | } | వీటిచూర్ణముపైకషాయములోవేసి చిక్కగాకాచి శరీరమునకు పట్టించి మర్దనచేయవలెను. |

## కార్పాస తైలము.

| | | |
|---|---|---|
| ౨. ప్రత్తివిత్తులు ౪ ఫ॥<br>ఉలవలు ౪ ,,<br>ఉదకము ౩౨ ,,<br>నూనె ౪ ,,<br>పాలు ౧౬ ,,<br>సైంధవలవణము ౧ ,,<br>చిత్రమూలము ౧ ,, | } | తైలపాకముగకాచి శరీరమునకు లేపనము చేయవలెను. |

## నస్యము.

| | | |
|---|---|---|
| ౩. గుంటగలగరఆకు<br>ఆముదపుకొనలు<br>వావిలిఆకు ,,<br>పొన్నగంటియాకు<br>జిల్లేడుకొనలు | } | సమభాగములునూరి కల్కముచేసి అందుమిరియపు చూర్ణము, నూనె కలిపి ముక్కులోపిండవలెను. |

౯౪. ఇప్పపిండి, సక్కెర } చనుబాలలో నూరి ముక్కులో పిండవలెను.

౯౫. కుంకుమపువ్వు, నెయ్యి, కలిపి ముక్కులో పిండవలెను.

౯౬. నల్లవావిలాకు, చింతాకు, నువ్వులనూనె, ఆముదము, కలుబందగుజ్జు, నేలములకసమూలము } వీటికల్కము చెవిలో పిండవలెను.

౯౭. ఎఱ్ఱిలొద్దుగుపొడి, నెయ్యి } పాలలో కాచిపానము చేయించవలెను

౯౮ సంబరేణు, ఆముదము, కాచిపానము చేయించవలెను.

౯౯. ఆవుపాలు, ,, ,, ,,

౧౦౦. నీలాకురసము ½ ఫ॥, మేకపాలు 3 ,,, బుడ్డకాచాకు రసముగ ,,, ఆముదము ౨,, } కాచిపానము చేయవలెను.

## ప్రసూతి చికిత్సలు.

౧౦౧. ప్రేళ్లకు వెంట్రుకలుచుట్టుకొని స్త్రీయొక్క గొంతున తుడువవలెను.

౧౦౨. బొంతజెముడుపాలను స్త్రీశిరస్సునందు లేపనముచేయవలెను.

౧౦౩. చేదుసార, ఆవాలు, పాముకూసము, వేపనూనెలో కలిపి యోనికి ధూపము వేయవలెను.

౧౦౪. చెన్నచెర్లగడ్డ (విషలాంగలీ) కల్కమును అరకాళ్లు, అరచేతులకు బూయవలెను.

౧౦౫. ప్రేళ్లలోని గోళ్లుతీసి, చక్కగకడుగుకొని ఆముదముపట్టించి హస్తమునుయోనియందు ప్రవేశముచేయుటచే లోపలనుండు మావిని వెలిపరుచవలెను.

౧౦౬. తిప్పతీగె ౧ తు॥
శొంఠి ,, ,,
కారుమునగవేరు ,,
నల్లఉప్పిచెక్క ,,
పిప్పిళ్లు, మోడి ½ ,,
చిత్రమూలము ౧ ,,
నల్లజీలకర్ర ,, ,,
నీళ్లు ౬౪ ,,
} కషాయముకాచి మూడుపూటలివ్వవలెను.

## దేవదార్వ్యాది కషాయము.

| | | |
|---|---|---|
| ౧౦౭. దేవదారు చెక్క | ౧ తు॥ | కషాయము కాచి మూడవవంతుకు దించవలెను |
| కటుకరోహిణి | ,, ,, | |
| వస | ,, ,, | |
| పిప్పిళ్లు, శొంఠి | ,, ,, | |
| నేలవేము | ౨ ,, | |
| తుంగగడ్డలు | ౧ ,, | |
| కరక్కాయలు | ,, ,, | |
| పర్పాటకము | ,, ,, | |
| పల్లేరుకాయలు | ,, ,, | |
| అడ్డసరపువేరు | ,, ,, | |
| తిప్పతీగె | ,, ,, | |
| నల్లజిలకర్ర, ఓమము | ,, ,, | |
| నీళ్లు | ౯౬ ,, | |

## సౌభాగ్యశొంఠి.

| | | |
|---|---|---|
| ౧౦౮. ఆవునేతిలో గోళ్లించిన శొంఠిచూర్ణము | ½ శేరు | లేహ్యపాకముగ వండవలెను॥ ½ తు.-౧తు. వరకు ౨పూటలు పుచ్చుకొనవలెను. |
| ఆవుపాలు | ౨ ,, | |
| చక్కెర | ,, ,, | |
| వాయువిళంగాలు, ధనియాలు, సోపు, శొంఠి, పిప్పిలి, మిరియాలు, నాగకేసరములు, తుంగగడ్డలు, దినుసుకు | ౧ తు॥ | |

౧౦౯.

| | | |
|---|---|---|
| తాళీసపత్రి | కరక్కాయలు | కురసానివామం |
| శొంఠి | నెల్లికాయలు | అతిమధురము |
| సన్నపిప్పిళ్లు | తాండ్రకాయలు | జాజికాయ |
| నాగకేసరాలు | అక్కలకర్ర | జాపత్రి |
| ఏలకులు | ధనియాలు | లవంగాలు |
| చలువమిరియాలు | జిలకర్ర | సోపు |
| లవంగపట్ట | ఓమం | చంగల్వకోష్టు |

ఈపైవస్తువుల చూర్ణములు దినుసుకు ౧ తులము ప్రకారము తీసుకొని,

చక్కెర ౫ శేర్లు
ఆవుపాలు ౫ ,,
ఆవునెయ్యి ౫ ,,
} చక్కెరపాకు పెట్టి దీనిలోపైచూర్ణము వేసి ద్రవముయిగురువరకునువండిన లేహ్యమౌను. మోతాదు ½-౧ తు॥ వరకు. దినమునకు ౨ పూటలు పుచ్చుకొనవలెను.

౧౧౦ పాముకూసము
మరువము
} నిప్పులోవేసి పొగపెట్టవలెను.

౧౧౧. పిప్పిళ్లు
వస
} నీళ్లలోనూరి భగమునకు లేపనము చేయవలెను.

౧౧౨.

| | | |
|---|---|---|
| ౧౬ | ౬ | ౮ |
| ౨ | ౧౦ | ౧౮ |
| ౧౨ | ౧౪ | ౪ |

ఈయంత్రమును భుజపత్రిమీదకాని రాగిరేకుమీదకాని వ్రాసి సాంబ్రాణి పొగవేసి చేతకట్టవలెను.

సుఖప్రసవ మంత్రము.

౧౧౩. శ్లో॥ ముక్తాయాసావిముక్తాశ్చ ముక్తాసూర్యేణ రశ్మయః। ముక్తస్సర్వ భయాద్గర్భః దేహిమాచిరమా చిరా॥

ఈమంత్రమును ౭ మార్లుచ్చరించుచు స్త్రీసుఖముగా ప్రసవించవలెనని ధ్యానముచేసి ఉదకమునుఅభి మంత్రించి పానము జేయించవలెను.

౧౧౪. యవక్షారమును ఉష్ణోదకములోకలిపి యివ్వవలెను.

౧౧౫ శొంఠి, పిప్పలి, మిరియాలు నాగకేసరములు, వజ దాల్చినిచెక్క, ఏలకులు ధనియాలు } ఇవిసమానముచూర్ణించి బెల్లపుపాకులోకలిపి పూటకు ½తు॥-౧తు॥ వరకుదినమునకు౩సార్లివ్వవలెను.

ఔషధములుచేయు పద్ధతులు.

కషాయము.

౧ ఫలము (౩ తులముల) ఔషధసామానులుండిన ౧౬ ఫలములునీళ్లుపోసి అందులో ఎనిమిదవభాగము యిగు

రునటులకాచిన కషాయమగును. దీనిమోతాదు పూటకు ౧ ఫలము. ఈకషాయమును పానసేకములయందుపయోగించదగును.

ఘృతము.

ఔషధములు చిక్కగ కషాయముకాచి అందులోనెయ్యివేసి నీళ్లభాగమిగురువరకు కాచవలెను.

పూటకు ½ తులము ప్రకారమివ్వవలెను.

తైలము.

ఔషధద్రవ్యములు, ద్రవపదార్థములు, నూనెలోవేసి ద్రవభాగమిగురువరకు కాచవలెను.

నస్యము.

ఔషధములనీటితోదంచి పిండుకొని ౧ ఫలముమోతాదు ముక్కులో పిండవలెను.

ఇతిశ్రీమద్గురువరకరుణాకటాక్ష వీక్షణాసాదితాష్ట వైద్యవిద్యానవద్య, శ్రీమద్ధోస్సూరుశుభ్రవేటివంశపయః పారావారరాకాసుధాకర, శేషగిరిరాయపుత్రరత్న, కవిరత్న, భిషగాచార్యేత్యాది బిరుదావళీ విరాజమాన, విబుధజన విధేయ, హోసూరుసుబ్బరాయప్రణేతంబైన, హిందూగృహవైద్యమను గ్రంథము,

సమాప్తము.

శ్రీసద్గురుచరణారవిందార్పణమస్తు.

# ప్రకటనలు.

ఔషధము ౧ నుండి ౫ చుక్కలు తేనెలోగాని, పాలలోగాని పుచ్చుకొనవలెను. ౧ ఔన్సు ౧—౦—౦

*Gonorrhea Drops 1—5 drops in honey or milk cures gonorrhea, gleet, burning and discharges 1 oz Re 1—o—o*

<u>మన్యజ్వరహారి</u>—దీనిసేవనచే అన్నివిధములగు చలిజ్వరములు మానును. ౫౦ మాత్రలు రూ॥ ౧—౦—౦

*Malaria pills—A certain cure for malaria*

*50 pills **Re.** 1—o—o*

<u>శుక్లశోధనచూర్ణము</u>—శుక్లదోషములన్నియు బోకడచును. ఇంద్రియపుష్టినిచ్చును. ౧౦ తు॥ రూ॥ ౧—౦—౦

*Suklashodhana Churna—Cures Seminal defects, Spermatorrhea and nervous debility 10 Tolas Re 1--o--o*

<u>ఋతుశూలహారి</u>—ఋతుశూలనుహరించును. స్రావము చక్కగకడచునటులచేయును. ౫౦ మాత్రలు ౧—౦—౦

*Ritusoolahari—Cures retention of or scanty menses*

ప్రదరారి—స్త్రీలకు కలిగెడు తెలుపు, ఎరుపు స్రావములను బంధించును. ౫౦ మాత్రలు ౧—౦—౦

*Pradarari—Stops excessive menstrual discharges*

*50 pills. Re. 1--o--o*

<u>ఉపదంశహారి</u>—సవాయిరోగములు, చురుకురోగములు, బోకడచుటలో దీనికి మించినది లేదు. ౫౦ మాత్రలు ౧—౦—౦

# ప్రకటనలు.

*Cure for Syphilis-Best specific for syphilis and other kindred diseases* *50 pills 1--0--0*

<u>ప్రాణదాయి</u>—దగ్గు, ఉబ్బసవ్యాధులకు అమృతము వంటిది.

౫౦ మాత్రలు రూ॥ ౧—౦—౦

*Pranadayi. Very useful in all sorts of coughs*
*50 pills Re. 1--0--0*

<u>సేతుబంధనగుళిక</u>—ఆమాతిసారము, రక్తాతిసారము, భేదులు మొదలగునవిగుణపరచును. ౫౦ మాత్రలు రూ॥ ౧-౦-౦

*Diarrhea and Dysentry pills 3 or 4 doses immediately stops Diarrhea and dysentry.* *50 pills Re 1--0--0*

*Apply to :—*

## Bhishagacharya. Pundit. H. Subbarayasastri,

KAVIRATHNA, GOLD MEDALIST, PHYSICIAN,

**Secunderabad.**

OR

## KAVIRATHNA DISPENSARY,

JAMMALAMADUGU,

CUDDAPAH (DT.)

ఈక్రిందిఅడ్రసులకు వ్రాయవలెను.

భిషగాచార్య పండిత. హెచ్. సుబ్బరాయశాస్త్రి,
కవిరత్న, గోల్డుమెడలిస్టు, వైద్యవిద్వాంసులు,
లేక, కవిరత్న ఔషధాలయము, శికింద్రాబాదు.
జమ్మలమడుగు,
కడపజిల్లా.

# "ఆయుర్వేదోదయ గ్రంథమాల."

# AYURVEDODAYA SERIES.

రాబోవు గ్రంథములు.

*(Works ready for publication)*

౧. హిందూగృహవైద్యము భాగములు II III.

౨. జలాహారవిహారములు. (*The Hindu system of Hygien and sanitation*) ప్రథమములోనింగ్లీషునందు ప్రచురమగును ఆత్రేయశాస్త్రాచారకర్తలయొక్క భావము సంపూర్ణముగ భౌతికాధ్యాత్మిక శాస్త్రాధారములతో విమర్శింపబడినది.

3. నాడీశబ్దవిమర్శనము. (*The Science of sphygmica*) *1915* వ సం॥ అఖిలభారత వర్షీయసప్తమ ఆయుర్వేదవైద్య సమ్మేళనమందు స్వర్ణపతక బహుమానమునొందిన గ్రంథము. దీనిచక్కగాచదివిగ్రహించిన నాడియను పదమున కర్థమును, రోగనిదానమును నాడిచూచుటచే గ్రహించుటకు వలయు జ్ఞానమునుకలుగును. ప్రథమంబున ఆంగ్లంబు నందు ముద్రింపబడును.

౪. ఆయుర్వేదాంగ్లేయ వైద్యశాస్త్రవిమర్శనము. (*A Review of Eastern and Western systems of medicine*) ఆంగ్లేయాంధ్రభాషలరెంటిలో ప్రచురమగును. ఇందు ఆయుర్వేదాంగ్లేయవైద్యశాస్త్రములపుట్టుక నుండి యిదివరకును గలతారతమ్యములను, ప్రస్తుతస్థితిగతులును, ఉభయశాస్త్ర సంప్రదా

యములకభివృద్ధికివలయును పాయంబులును చక్కగావివరిం పబడినది వైద్యాభిమానులగు వారికి కేవలపఠనీయగ్రంథము.

౫. త్రిదోషములు (*The Three Humours*) వాత, పిత్త, శ్లేష్మముల యొక్క తత్వనిర్ణయము. ప్రథమంబున ఆంగ్లేయభాషలో ప్రచురమగును.

౬. రోగబీజములు. (*Diseases and their Causes*) ఆంగ్లేయాంధ్రభాషలలో ప్రచురమగును. ఇందునరోగములకుమూలకారణమేమని ఆయుర్వేదాంగ్లేయ శాస్త్రాధారవాదములతోనిర్ణయింపఁబడిన ఉత్కృష్టమైనగ్రంథము. ప్రతి యొకరు చదివి తీరవలయును.

౭. శుక్లశోణితములు. ప్రథమంబున ఆంధ్రభాషలో ప్రచురింపఁబడును. ప్రజోత్పత్తికికారణభూతమగు యీధాతువిశేషంబుల యొక్క యావద్వృత్తాంతము నిందుబొందు పరుపబడియున్నది ధర్మార్థకామమోక్షంబులను భవింపవలయునను వారందరును పఠించవలెను.

౮. కలియుగపక్షులు. వైద్యులయొక్కయు, రోగులయొక్కయు, కపటోపాయములను వెల్లడిచేయుహాస్యరసప్రాధాన్యమైననీతిబోధకగ్రంథము. ఆంధ్రభాషయందు ముద్రింపఁబడును.

## రాబోవుగ్రంథములు.

౯. ఆయుర్వేదవైద్యవిద్వాంసుల జీవితములు. ఆంధ్రంబున ప్రథమములో ముద్రితమగును.

౧౦. శరీరనిర్మాణశాస్త్రము (*A manual of Anatomy*) ప్రథమములో ఆంధ్రంబున ముద్రింపబడును.

౧౧. శరీరధర్మశాస్త్రము. ( ,, , *Physiology*) ,,

౧౨. ఔషధసంయోగశాస్త్రము (*A manual of pharmacy.*) ఔషధములు చేయుపద్ధతులును, వంటౌషధములయొక్క పాకములును గుఱించి అనేకవైద్యరహస్యవిషయములతోడ ప్రచురమగును. (ఆంధ్రంబున ప్రచురింపబడును.)

౧౩. వనస్పతిస్వరూపచంద్రిక. (*A discriptive work on medicinal Herbs and Plants.*) వైద్యములో వాడుచుండు వనస్పతుల నిర్ణయమును, స్వరూపములును కలదిగనుండును ఆంధ్రంబున ప్రచురింపఁబడును.

౧౪. శిలాజతుచికిత్స (*Silajit Therapy*) శిలాజతుయొక్క పుట్టుకయును, దానియొక్క ఔషధోపయోగములును విపులముగా వివరింపబడినది.

